# ఇదీ లోకం!

(మూడు అంకాల సాంఘిక నాటకం)

కొండముది గోపాలరాయశర్మ.

ప్రథమ ప్రచురణ 1946 ఆగష్టు
P.I.C. No. Q.H. W.G. 2.

సర్వస్వామ్య సంకలితం
వెల రు 1—4—0

ఈనాడు—

నాటకం ప్రజాజీవితాన్ని ప్రతిబింబింపచేయాలి;
నాయకుడు ప్రజాభిప్రాయాన్ని గమనించి ముం
దంజవేయాలి.

పబ్లిషర్సు :
రామా అండ్ కో.,
ఏలూరు.

పట్టాభిరామా ప్రెస్,
ఏలూరు.

# తొలిపలుకు



మూడు అంకాలలో నాలుగైదు రంగాలలో ఒక నాటకాన్ని వ్రాసి ప్రదర్శింపజేస్తే ప్రజామోదాన్ని పొందగలదూ? 15 రంగాలకు తక్కువగాకుండా నాటకాలు ప్రదర్శింపబడుతున్నవిగదా! పద్యాలతోనిండిన నాటకాలు కొన్ని సంవత్సరాలుగా దేశంలో ప్రదర్శింపబడుతున్నవిగదా! ఇప్పుడు పూర్తిగా వచన నాటకాన్ని ప్రదర్శిస్తే ప్రజమెచ్చుతుందా? ఇలాంటి సందేహాలలో 'ఎదురీత' నాటకాన్ని వ్రాసినపిమ్మట సుమారు 18 నెలలపాటు దాచివుంచాను. ప్రయత్నించిచూచి, నాటకం రక్తికట్టకపోతే ఆలోచించుదామనుకొని, 'ఎదురీత'ను వెంకటగిరి ఎమెచ్యూర్ ఆర్టిష్టుసహాయంతో ప్రజలకు అందజేశాను. ఆనాటకానికి వచ్చిన సుస్వాగతం నన్ను చకితుణ్ణి జేసింది. నాటకంలో చలనం, సన్నివేశాలు వున్నప్పుడు అది గద్యమైనప్పటికీ ప్రజహర్షించ గలదని తెలుసుకున్నాను.

నాటకంలో కథావస్తువు హృద్యమై వుండాలనడం నిర్వివాదాంశం; దానిలో చలనంవుండాలి; రచనకు అవకాశం వుండాలి; విభిన్నప్రకృతులుగల పాత్రలసృష్టికి నదుపాయం వుండాలి.

నాటకం రక్తికట్టడమనేది ఎప్పుడూకూడా సన్నివేశాల సంఘటనపై ఆధారపడివుంటుంది. పాత్రలలో వైవిధ్యం నాటకానికి నిండునిస్తుంది. సన్నివేశాల సంఘటనలో రచనా చాతుర్యమెంతగా చూపగలిగితే, నాటకం రక్తికట్టడానికి అంతగా అవకాశాలు వుంటవి.

'ఎదురీత'కు వచ్చిన స్వాగతమే నన్ను 'ఇదీలోకం' వ్రాయడానికి ప్రోత్సహించింది.

యుద్ధంనుంచితిరిగివచ్చిన వారిదృక్పథం, దానిఫలితంగా సంఘంలో రానున్న విప్లవం; ధనమానికి గురియై హృదయ విహీనులై పోయేవారిబతుకు; పెట్టుబడివిధాన దుష్ఫలితాలు, ఇందులో ప్రధానాంశాలు. పెద్దోగిలో యుద్ధంలోకి వెళ్లి తిరిగివచ్చిన తక్కువకులాలవారిని, శీవచ్ఛవంలో కడుపు కక్కుర్తికొద్దీ మానాభిమానాలను చంపుకుని, పొట్టకూటికై ఎంతటినైచ్యానికైనా సిద్ధపడేఅభాగ్యులను, లక్ష్మీనరసయ్యలో కరడుకట్టిన పెట్టుబడిదారుని చూపించ ప్రయత్నించాను.

నాటకాన్ని ప్రదర్శన జరుగకుండా ముద్రించవాను. కాని, అనుభవంమీద నాకుతోచినదేమంటే, పాశ్చాత్య దేశాలలో వలెనే ఆక్టింగ్ కాపీలు ముద్రించడం అవసరం. వ్రాతప్రతులతో ప్రదర్శన చాలాకష్టాలతో కూడినవిషయం. ఆక్టింగ్ కాపీల నాధారంగా చేసుకొని పలుప్రాంతాలలో,

కనీసం భిన్నమైన రుచులుగల ప్రేక్షకులముందు ప్రదర్శించిన పిమ్మట, తగుసంస్కరణలను జేసి నాటకంగా ముద్రించడంకద్దు.

కాని, ఈనాటకాన్ని ముద్రించడానికి వ్యక్తిగతంగానాకు కొన్ని కారణాంతరాలు తటస్థపడి, గత్యంతరం లేకపోయింది. ఏవో ఆశలతో ఒకపనిచేయడం, అవిసానుకూలం కాకపోవడం జరుగుతుంది. దోషమని తెలిసికూడా పరిస్థితులకులోబడి నేనీ నాటకాన్ని ప్రదర్శనజరుగకముందే ముద్రించాను. రచన ఎంతజాగ్రత్తగా జరపబడినప్పటికీ, ప్రదర్శన చూచినపిమ్మట కొన్ని లోటుపాట్లు కనుపించడంకద్దు. ద్వితీయముద్రణలో వీటిని సరిచేసుకుంటాను. దీనిని ఆక్టింగ్ కాపీగానే భావించాలని ప్రార్థన.

మరొక్కమాట:—

ఆంధ్రదేశంలో శ్రీ కూడవల్లి రామబ్రహ్మంగారిని ఎరుగని కళాభిమాని వుండడు. వారు ఆంధ్రనాటకరంగానికి కళాపరిమళ్తుకు చలనచిత్రజగత్తికి చిరపరిచితులు. వారి పరిచయభాగ్యం నాకు కొన్నినెలలుగానే కలిగినప్పటికీ, వారు నాయందు ఎంతోవాత్సల్యమును జూపుతూ, హితైషులై ఆప్తులలో ఒకరైనారు. నాకృతజ్ఞతా సూచనగా ఈ నాటకాన్ని వారికి అంకితం చేస్తున్నాను. వారికి దీర్ఘాయురారోగ్యాలు కలుగజేయవలసినదని పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

నావ్యక్తిగత కారణాలనువిని, 'ఇదీలోకం' ప్రచురణను ప్రోత్సహించిన శ్రీయుతులు తాళ్ళూరి సుబ్బారావు, భోగరాజు బుచ్చిరామయ్యగార్లకు, అవసరంగా ముద్రించవలసిన ఇతరగ్రంథములున్నప్పటికీ, సత్వరంగా 'ఇదీలోకం' వెలువడజేసిన పట్టాభిరామాప్రెస్ అధిపతులు శ్రీ ఈదర వెంకయ్యగారికి కృతజ్ఞుణ్ని.

బుధజనవిధేయుడు,

మదరాసు,

10_8_46.

—గోపాలరాయశర్మ.

# అంకితం

నాటక కళాభిమానులు

నా శ్రేయోభిలాషులు

శ్రీ

గూడవల్లి

రామబ్రహ్మంగారికి.

# ఈ నాటకంలో

| | | |
|---|---|---|
| పుల్లడు | — | ఒక మాలవాడు |
| పెద్దోడు<br>బుడ్డోడు | — | వాడి కొడుకులు |
| లక్ష్మీనరసయ్య | — | మిల్లు యజమాని |
| వెంకయ్య | — | అతడి అన్న |
| తాత | — | ఒక బిచ్చగాడు |
| శాస్త్రి | — | కవి, జ్యోతిష్కుడు |
| లక్ష్మి | — | పుల్లడి భార్య |
| జీవచ్ఛవం. | | |



# ఏడి లోకం!

1 వ అంకం                    1 వ రంగం

(Drop curtain వెనక్కి street curtain వుంటుంది. రంగము ఒక వీధి. ఈ curtain ను పక్కప్రక్కకు లాగివేయ డానికి వీలుగా వుండాలి )

(Drop లేవక ముందు తెరలోనుంచి ఒక గంభీరమైన కంఠస్వరం :—

దేశమును ప్రేమించుమన్నా!
మంచి యన్నది పెంచుమన్నా!

స్వంతలాభము కొంతమానుక
పొరుగువానికి తోడుపడవోయ్!
దేశమంటే మట్టికాదోయ్!
దేశమంటే మనుషులోయ్!    (గురజాడ)

(ఈ పాట ఆగేసరికి Drop పైకివెళ్ళాలి. వీధి కనిపిస్తుంది. 60 సంవత్సరాల వయస్సు మాసిన చిరుగు వస్త్రాలతో, బిచ్చ మెత్తుకుంటూ రంగంమీదకి ఎడమప్రక్కనుంచి ప్రవేశిస్తాడు. అతని పేరు 'తాత'.)

కీర్తిశేషులు సుబ్రహ్మణ్యం పంతులుగారు—సాక్షాత్తు బలి చక్రవర్తులు! వారివాకిటనిలచి పట్టెడన్నం కోరడానికి సిగ్గులేదూ! వారినిలా చిన్నబుచ్చుతం తగునా?... పంతులుగారూ! తమతో సెలవిచ్చియున్నానే, అపాత్ర దానమని, దానికిచే ప్రత్యేకశాస్త్రాలున్నాయని. ఆశాస్త్రాలలో మీపితృపాదులు సన్నుతించి, 'శాస్త్రులుగారూ! మిమ్మల్ని చూడగనే పరమలోభికైనా దానం చేయాలని అభిలాష కలుగుతుంది' అని సెలవిచ్చేవారు.

తాత:—ఆకలి మండిపోతుందాది బాబూ!

లక్ష్మి:—శాస్త్రులుగారూ! ఇవి రేషను రోజులని, మనకిచ్చేబియ్యం మనకే సరిపోవడంలేదని చెప్పండి!

శాస్త్రులు:—విన్నావా పంతులుగారి మాటలు! యదార్థం యథాతథంగా సెలవిచ్చారు. మరిపో!

తాత:—అందరూ సెప్పినమాటే దొరగారు కూడా సెప్పారు. ఇసేసమేముంది? బాబూ!

శాస్త్రులు:—సత్యంలో విశేషం మృగ్యం. నీతో మాకు వాదనేమిటి? వెళ్ళిపో.

తాత:—ఉన్నమ్మకుడా ఉన్నమ్మకే ఇపతింది రేసన్ పెట్టారు గాని, బీదా, బిక్కీ గతి కానరా బాబూ! గోరుసుట్టుమీన రోకటిపోటుగా రేసన్ కూడా మామీదగానే పోవాలా?

శాస్త్రుల్లు:—(కఠినంగా) అనవసరప్రసంగం చేయకు; పంతులు గారికి ఆగ్రహం రాగలదు. హాయిగా రామా, కృష్ణా అనుకో. ఆర్తజనబాంధవుడే అన్నింటికీ వున్నాడు! పో!

(తెరమూసుకుపోతుంది)

తాత:— రామనామము తలంచి పిలిచితినా?

కాసంతదయయు,

సాటివారికి గానకయుంచినచో!

వర్ణగర్వము యింత జేతునురా

పరమాత్మ మెదలో

నరరాసులు ఒక్కటేగదరా!

కలిగినందుకు దానశీలుడవై

బీద సాదల

ఇల వేల్పువై ధన్యు డందుమురా!

(వీధి తెర రెండవసగం—రెండవ నైపు తొలగుతుంది. అక్కడ ఒక నులక మంచం మీద ఒక స్త్రీ పడుకొని వున్నది, పేగులచ్చి. ఆయాసంతో బాధపడుతున్నది. ప్రక్కనే పుల్లడు కూర్చుని ముంతలో నీళ్ళు దాని నోటిలో పోస్తున్నాడు.)

తాత:—సాటివాడ్ని. కూటికి లేక అలమటించి పోతున్నా!

పుల్లడు:—(మెల్లిగా) ఇంత ప్రపంచకంలో నాగుడిసే దొరికిందా, తాతా?

తాత:—ఈ మాత్రం సల్లనిమాట యిక్కడే యిన్నాను బాబూ!

పుల్లడు:—తాతా!... తాతా! తిండికిలేక మాబతుకే...

తాత:—కనిపెట్టుండు బాబూ! ఇంకా నాకాళ్ళలో సత్తా పూరాగా చావలేదు. మీకోసంకూడా నేనే తిరిగొస్తా.

(తెరమూసుకొంటుంది.)

తాత:— కనవా, యీగతి బీదల సాదల
మాన్పరా రాతిన చిత్తులదేవా!
ఒకరికివినోదము, మందికిహోమము
ఇదియే ధర్మము! నీమది దేవా?
రావా? అసలున్నావా? లేవా?

(తాత మెల్లిగానడిచి ఎడమవైపుకు వెళ్ళిపోగానే, వెనకనవున్న వీధితెర తొలగుతుంది. శాస్త్రుల్లు, లక్ష్మీనరసయ్య బల్లదగ్గిర యిందాకటివలెనే కూర్చుని ఉన్నారు. రెండవ వైపున మంచంగాని, లచ్చిగాని, పుల్లడుగాని లేరు. రంగం – లక్ష్మీనరసయ్య యింటిముందు స్థలం – సమయం ప్రొద్దున...)

లక్ష్మి:—అయితే మీరు చెప్పేదేమిటి? ఏవో శ్లోకాలు చదువుతున్నారు. అవి నాకు అర్థంకావు. నాలుగు ముక్కల్లో క్లుప్తంగా చెప్పేయండి.

శాస్త్రు:—అరటిపండొలిచినట్లు మనవిచేస్తా. జాతకరీత్యా తమకు మహార్దశ యిప్పుడే ఆరంభ మయింది. తత్కారణాన ఇక మీదట తమరు వ్యాపారంలో లాభమేకాని నష్టం వుండదు. లావాదేవీలలో రాబడే కాని పోబడి వుండదు.

లక్ష్మి:—కొంచెం తేటగా వివరంగా చెప్పండి.

శాస్త్రు:—ధాన్యవిక్రయం ద్వారా ధనసిద్ధి. తత్రాపి విశేష లాభయోగం.

లక్ష్మి:—విశేషలాభం అని బిగ్గరగా అనేరుసుమా.— Black Market వ్యాపారం చేస్తున్నానని అనుమాన పడతారు.

శాస్త్రు:—దానశీలురని యీ ప్రక్క నాలుగుజిల్లాలలో పేరు మ్రోగిన మీరు అటువంటి దుష్టజనవ్యాపారం చేస్తారని ఎవరనగలరు? ఇక అనుమానించడమంటారా! లోకులు కాకులు — ఇదుగో పులి అనగానే అదిగో తోక అంటారు.

లక్ష్మి:—మాటవరుసకడుగుతాను. Black Market వల్ల వచ్చే ధనాన్ని ఒకవ్యక్తి దానధర్మాలకు వినియోగిస్తా డనుకోండి. అపుడతడు Black Market వ్యాపారం సాగించడం శిష్టజనవ్యాపారంగాని దుష్టజనవ్యాపారం కాదుగదా?

శాస్త్రు:—అందుకు సందేహమా? ఫలితం ప్రధానంగాని,...

లక్ష్మి:—సరే. మీకు చెప్పేదేదో పూర్తిచేయండి... ...

శాస్త్రుల్లు:—విశేషలాభ యోగం. అయితే కించిత్ జాగరూకత ఆవశ్యకమని తోస్తోంది.

లక్ష్మి:—ఆ?

శాస్త్రుల్లు:—మరేం ప్రమాదం లేదండి.

లక్ష్మి:—ఏమిటో అసలు విషయం చెప్పండి.

శాస్త్రుల్లు:—తమకు రహస్యంగా ధనం సిద్ధించే సూచనలున్నవి ... ...అంటే మరేం లేదండి. ... ...నిధి నిక్షేపాదులు లభించవచ్చు.

లక్ష్మి:—పెరటి గోడక్రింద బంగారంతోనిండిన కుండ కనపడ వచ్చు నంటారు! అంతేనా?

శాస్త్రుల్లు:—ముమ్మాటికీ.

లక్ష్మి:—సరే. చూడండి. శాస్త్రుల్లుగారూ! ఈమాట మాత్రం కడుపులో నే దాచుకోండి గాని, బయటికి పొక్కనివ్వకండి. మీరు చెప్పినట్లు జరిగితే అందులో సగం మీవంతు.

శాస్త్రుల్లు:—ఓహో! దానధర్మాలలో మీతండ్రిగారిని మర పిస్తున్నారు. వారంటూ ఉండేవారు సుమండీ "శాస్త్రుల్లు గారూ! నా కొడుకు నాతరువాత దానధర్మాలలో నా అంత కావాలని!" వారు బ్రతికే వుంటే ఎంతోఆనందించే వారు.

లక్ష్మి:—ఈమహాద్దశలో యింకారాగల విశేషాలేమిటి?

శాస్త్రులు:—పట్టినదల్లా బంగార మవుతుందండి. కోరినదల్లా స్వాధీనం కాగలదండి.

లక్ష్మి:—ఏదీ...

శాస్త్రులు:—పట్టినదల్లా...

లక్ష్మి:—అదికాదు. రెండవవాక్యం.

శాస్త్రులు:—కోరినదల్లా స్వాధీన మవుతుందండి

లక్ష్మి:— ఆ! ...అహా!...ఏదీ మరొక్కసారి.

శాస్త్రులు:—కోరినదల్లా స్వాధీన మవుతుందండి.

లక్ష్మి:—(అత్యంత ఆతురం నెమరువేస్తూ) కోరినదల్లా...కోరినదల్లా...స్వాధీనం...స్వాధీనం...

శాస్త్రులు:—చిత్తం చిత్తం ...సద్బ్రాహ్మణునికి సువర్ణ దానంచేస్తే...

లక్ష్మి:—మరొక్క సారి అనండి.

శాస్త్రులు:—సద్బ్రాహ్మణునికి...

లక్ష్మి:—(చికాకుతో) అదికాదు!

శాస్త్రులు:—ఏదానండి? _ కోరినదల్లా తమకు స్వాధీనమవుతుందండి. కొండమీంది కోతి అయినా సరే. నాగలోకంలోని నాగకన్య అయినా సరే. మీరు... ...

లక్ష్మి:—కాదు శాస్త్రులూ' మానవలోకంలో మనిషే...

శాస్త్రులు:—చిత్తం, చిత్తం.

లక్ష్మి:—మనవంటి మనిషే !

శాస్త్రులు:—మనవంటి మనిషా ?

లక్ష్మి:—అదేనయ్యా ! మనిషన్నమాట

శాస్త్రులు:—చిత్రం చిత్రం.

లక్ష్మి:—(అనుభవిస్తూ) దివ్యసుందరవిగ్రహం.

శాస్త్రులు:—లేకుంటే, తమ చిత్తం ప్రసరించదండీ, చిత్రం చిత్రం.

లక్ష్మి:—ఎంతసౌందర్యం ! ఆపిల్లను ఒక్కసారే చూచాను — ఆకాలవగట్టున, ఆతెల్లని చీర కట్టుకొని, ఆ మొలలోతు గడ్డివున్న పచ్చని ఒడ్డుమీద, మెల్లగా, సున్నితంగా, వయ్యారంగా నడుస్తూంటే, ... ...నడుమ్మీదింక పాము వలె వ్రేలాడుతున్న జడతో, కిలకిలలాడుతూ, చిరునవ్వులు చిందులాడుతున్న చిరుమొఖంతో — కేవలం నన్ను గాచు లాగావున్నది. మెత్తని నునుపైన ఆ చెక్కిళ్ళమీద అస్తమిస్తున్న సూర్యుని బంగారు కిరణాలు పడుతుంటే, అవి మెరసిపోతున్నాయి నీలాల్లాగా ! ... ...

శాస్త్రులు:—ప్రబంధకవులను మరపిస్తున్నారు. కాళిదాసు అంటాడు — అనాఘ్రాతం పుష్పం — అంటే తెలుగున వాసన చూడవట్టి ప్రసవంబు — అదేవిధంలెండి.

లక్ష్మి:—ఏదీ ! ఆ పద్యం పూర్తిగా అనండి.

శాస్త్రులు:—"వాసన చూడనట్టి ప్రసవంబు, నఖంబుల ద్రుంప నట్టి నూత్నోత్తమ పల్లవంబు, పరులానని క్రొవ్విరి తేనె, సూచి విద్ధానము లేని రత్నము, మహోన్నత పుణ్యఫలంబు వోలు ఆ భాసురగాత్రి సోయగమెవ్వండు భుజింప విరించి వ్రాసెనో?"

లక్ష్మీ:—పద్యం షట్కట్టురాయిలాగా పడింది గాని, చివర భాగం 'ఎవండు భుజింప' అన్నది బాగాలేదు.

శాస్త్రులు:—[illegible] విత్తం. వాక్కు తెలుసు అంకితం చేసుకుంటాను.

లక్ష్మీ:—(అంగీకారసూచకంగా తల[illegible]పుతా[illegible])

శాస్త్రులు:—వాసన చూడనట్టి ప్రసవంబు, నఖంబుల ద్రుంపనట్టి నూత్నోత్తమ పల్లవంబు, పరులానని క్రొవ్విరి తేనె, సూచి విద్ధానము లేని రత్నము! మహోన్నత పుణ్యఫలంబువోలు ఆ భాసురగాత్రి సోయగ మపారముగా భుజియింత్రు మీరికన్!

లక్ష్మీ:—కాళిదాసును చంపి పుట్టావయ్యా!

శాస్త్రులు:—అభినవభోజులైన తమ సన్నిధిని!

లక్ష్మీ:—ఆ పిల్ల రంగుకు నలుపు.

శాస్త్రులు:—బొగ్గు జాతిలో దేనండి వజ్రం!

లక్ష్మీ:—కులం తక్కువ.

శాస్త్రు:—గుణాంతకన్న గాదు కదండీ.

లక్ష్మి:—చాలా తక్కువకుం.

శాస్త్రు:—అనగా! - - - -

లక్ష్మి:—అనగా - - - అనగా - - -

శాస్త్రు:—చిత్రం, చిత్రం.

లక్ష్మి:—అనగా, అనగా ఆపిల్ల మాలపిల్ల.

శాస్త్రు:—పిల్లలు కానేరదు. - అంతే. తత్రాపి - -

లక్ష్మి:— శాస్త్రుగారూ! ఏదో వాళ్లు మంచి ఏమిటేమిటో అన్నాను. మరచిపోండి.

శాస్త్రు:—చిత్రం. చిత్రం,

లక్ష్మి:—నా, నేను మరచిపోలేను. గత్యంతరం - - -గత్యంతరం - - - .

శాస్త్రు:—తమకు అసాధ్యం అంటూ వుంటుందా? రాజు తలుచుకుంటే - - -

(పుల్లయ్య వచ్చి, చేతులుకట్టుకొని దూరంగా నిలబడతాడు.)

లక్ష్మి:—ఇంతకీ మనజాతకంలో ప్రస్తుతం మహార్దశ నడుస్తున్న దంటారు.

శాస్త్రు:—అవురాలా.

లక్ష్మి:—ఏం పుల్లయ్యా! బండీ తోలడాని కొచ్చావా? కనుపించి చాలాకాలమైంది. ఏమిటి విశేషం?

పుల్లయ్య:—ఇంటిది సావు బతుకుల మీదుందాదండి.

లక్ష్మి:—చూచారూ శాస్త్రుల్లుగారూ! మనమిల్లులోని పని వాళ్ళందరిలోకి వీడంటే నాకెంతో విశ్వాసం. పాపం! వీడిది పెద్ద కుటుంబం. పదే! పుల్లిగా! పెద్దవాడా, శాస్త్రుల్లు గారికి నీ విషయం చెప్పుకో. వాడి సంగతి వింటే పాషాణం కూడా కరిగిపోతుందండి.

పుల్లడు:—మా యింటిల్లిపాదీ అందరికీ ఏదోరోగమేనండి. అయ్యగారి ఇల్లులో పని చేస్తుండానండి. అరు తెల్సు కొంటే నాలాంటోళ్ళస లచ్చలున్నా కాపాడగలోరండి. నే నొంటిగాన్నె పని చేస్తే వచ్చేసొమ్మలి సబ్బుతో మాకు గడ వడం లేదండి. పెద్దోడుయుద్దాని కెళ్ళి, ఆడ కాలిరగ్గొట్టుకోని కొంపకు సేరినాడండి. సిన్నోడు సెన్నాపట్టణంలో రిక్షా బండిలాగుతుండేవాడండి. సిపాయిలోళ్ళ లారీకిందపడి ఆడ సెల్లినాడండి. బుడ్డోడికి నోరు లేదు — మూగోడండి. (తెర లోపలికి చూస్తూ, రమ్మని సౌంజ్ఞ చేస్తాడు. పుల్లడిమూగ కొడుకు బుడ్డోడు వచ్చి అందరిను తేలు చూస్తూ నిలుచుం టాడు.) ఇంకి దానికేమో సరింగా తిండిలేక, గోగుపుల్ల యిందండి. అట్టైన వారం రోజులనాడు నెలలునిండకుండా నే నొప్పులొచ్చి, కడుపుపోయి, మంచమెక్కింది బాబూ కాగాపోగా పిల్లనాగిమ్మాత్రం నిండుగా తింటుంటది.

శాస్త్రుల్లు :—అయ్యో! పాపం! నీ అవస్థ వింటే గుండె పగిలి పోతున్నది ... ... ... నీకు సస్త్రయంలో కసి .ఫున్నా డన్నమాట.

పుల్లడు :—అదేందో, మీకే తెలియాలి దొరా!

లక్ష్మి:—వీడికొడుకున్నాడే; ఆయుద్ధానికి వెళ్ళొచ్చినవాడు, చాలా ఆగిరిపాటుపిండం. మహా నోటిదురుసు. కొంచెం తెలివికలవాడే.

శాస్త్రుల్లు:—చిత్తం, చిత్తం ... ...

లక్ష్మి:—సరే. ఇకమీరు వెళ్లిరండి నాకు మిల్లుకు టైమయింది.

శాస్త్రుల్లు:—మహాతాయీ! మా పిల్లలు చిల్లగింజ గాణాం పెట్టుకున్నా. ఏదో మీలాంటివారిదయవల్ల నాలుగు డబ్బులు గడుపుతున్నాను. కాస్త మీరు ఒక చల్లనిచూపు చూస్తే...

లక్ష్మి:—ఏమిచేయమంటారు?

శాస్త్రుల్లు:—చిత్తం, చిత్తం మరేం లేదండి. నాలుగుబస్తాల బియ్యం ఇప్పించాలి. ఈ నాలుగంరోజులలో ఎంతధరైనా ఇవ్వగలనండే ననుకోండి. కాని, కాస్త మీరు దయ జూపించాలి.

లక్ష్మి:—మీరుగనక, కాదనలేకపోతున్నాను. ఏమైనా, ధరకుపైని రెండురూకలు ఇవ్వాలి. లేకపోతే నాకు గిట్టుబాటు కాదు.

శాస్త్రుల్లు:—తమరలాసెలవిస్తే ... ...

లక్ష్మి:—అవునులే! తీసుకుపోయి పూర్తిలాభానికి అమ్ముకోరు మరి! మాకిచ్చినదానికి రెట్టింపు లాగుతారుగాని వదలరుగదా! ... నాదగ్గిర దాపరికం దేనికి?

శాస్త్రుల్లు:—చిత్తం, చిత్తం, … …

లక్ష్మి:—ఇష్టమైతే, రాత్రికి రండి.

శాస్త్రుల్లు:—బండి తమరే సప్లయిచేయించాలి.

లక్ష్మి:—రెట్టింపు బాడిగ ఇవ్వాల్సివస్తుంది … …

శాస్త్రుల్లు:—చిత్తం, చిత్తం. మరి శెలవుతీసుకుంటానండి…

(శాస్త్రుల్లు సాగుతూవుండగా అతని వంక కేమారుస్తూ వెంకయ్య ప్రవేశిస్తాడు)

లక్ష్మి:—(ఆశ్చర్యంగా) ఇదేమిటన్నయ్యా! దారితప్పివచ్చినట్లున్నావ్?

వెంకయ్య:—నేను దారితప్పితే రాకనేపోదును; నువ్వు దారితప్పుతున్నావని విని, హెచ్చరిద్దామని వచ్చాను. — — — ఈయనెవరు?

లక్ష్మి:—వారినెరుగవ్? శాస్త్రుల్లుగారు. పేరుమోగినకవి. ప్రసిద్ధ జ్యోతిష్కులు.

వెంకయ్య:—ఏమో! నేనువినలేదు. ఆశ్రితుడా? — — ఊఁ —

లక్ష్మి:—ఏదో మనను నమ్ముకున్నవాడు.

వెంకయ్య:—నీయిల్లులోని పనివారు మాత్రం నిన్ను నమ్ముకున్నవారు కారా?

లక్ష్మి:—ఈయన పండితుడు.

వెంకయ్య:—వారు అన్యాయకులు; చెంప టోడ్చేవారు!

లక్ష్మి:—ఇవాళ చాల వింతగ వున్నయ్ నీ మాటలు?

వెంకయ్య:—నీ చేతలకంటేనా ?

లక్ష్మి:—నేనేమంత వింత పని చేశాను ?

వెంకయ్య:—వింత అంటే ఆశ్చర్యకరం మాత్రమే కాదు.
అవమానకరమైన పని కూడ వింతపని అవుతుంది.

లక్ష్మి:—ఏమిటో నాకేమీ తెలియటం లేదు.

వెంకయ్య:— దొంగలెక్కలు బాగా తెలియడానికి!

లక్ష్మి:—ఇన్నిరోజులనుంచి కంటికి కనుపించకుండా వుండి, ఇవ్వాళ వచ్చింది నాతో కయ్యానికా? నేను దొంగలెక్కలు వ్రాయగా నువ్వు చూశావా? దొంగలెక్కలు వ్రాస్తేనే నాకు ఎక్కడక్కడగా వ్యాపారం లాభసాటిగా సాగుతుంటే దొంగలెక్కలు వ్రాయాల్సిన అవసరమేమిటి? పోట్లాడానికేనా వచ్చింది?

వెంకయ్య:—నువ్వు దొంగ లెక్కలు వ్రాయడం లేదా ?

లక్ష్మి:—లేదు.

వెంకయ్య:—లేదా ?

లక్ష్మి:—ముమ్మాటికీ లేదు.

వెంకయ్య:—భగవంతుడి మీద ప్రమాణం చేసి చెప్పు.

లక్ష్మి:—ఇది కోర్టుగాదు; ప్రమాణం చేయడానికి.

వెంకయ్య:—ఇక్కడ ప్రమాణంచేసి చెప్పే అలవాటు లేకపోతే పరితపించే రోజున ప్రమాణాలు కూడా రక్షించవు.

లక్ష్మి:—నీతో నాకు వాదనదేనికి? నీ స్వవిషయాలలో నే నేమన్నా జోక్యం కలుగజేసుకొంటున్నానా ?

వెంకయ్య:—నీ స్వవిషయమైతే నేను కూడా జోక్యం చేసుకోను గాని, ఇది మనవంశానికి సంబంధించినది. వంశానికి కళంకం తీసుకురావద్దని చెప్పడానికి వచ్చాను.

లక్ష్మి :—మా యిద్దరిలోను మనవంశానికి కీర్తి, ప్రతిష్ఠలు తెచ్చిందెవరో, కళంకం తెచ్చిందెవరో నీకు తెలియదా ? నాకు తెలియదా ? లోకానికి తెలియదా ? నాన్న యిచ్చిపోయిన ఆస్తిని మనం పంచుకొన్నాం. నీవంతు నీవు సర్వ నాశనం చేశావు. నావంతు నేను ఇబ్బడిగా చేశాను.

వెంకయ్య:—మనవంశానికి ధనంకంటె దానధర్మాలు ప్రధానమైనవి. మరచిపోకు.

లక్ష్మి:—దానధర్మాలలో మాత్రం నేజేసిన లోటేమిటి? పండితులకు, కవులకు, దానంపొందే అర్హతగలవారికి అందరికి, ఆశ్రయించిన తక్షణమే నేనుశక్తికొలది దానం చేస్తున్నాను. నీలాగా అర్హతలేని వారందరకీ డబ్బు వెదజల్లితేనే దానమవుతుందా ?

వెంకయ్య:—ఆశ్రయించిన వారికి ఇచ్చేదాన్ని దానమనడం కంటే తెలివితక్కువలేదు. నీదగ్గరజేరి నువ్వు సాక్షాత్తు యింద్రుడవు, చంద్రుడవు అని పొగడగానే నువ్వు ఉబ్బితబ్బిబ్బై, ఆ భట్రాజుకు పారితోషిక మివ్వడం—ఇదికూడ దాన

మేనా? నువ్వు జేరదీసిన పండితులందరు నిన్ను అంతవాడి వింతవాడివని పొగడు తున్నారనే సంతోషిస్తున్నావు కాని, వారిమాటలన్నీ నాలుక చివరవేననీ, నువ్వేనాడు వారికి డబ్బివ్వకపోతే ఆనాడు భూషించేవారే నిన్ను దూషిస్తారనీ పారజూచావా?

లక్ష్మి:—చాలిద్దూ, ధర్మోపన్యాసాలు!

వెంకయ్య:—తనశక్తిసామర్థ్యాలు తాను తెలుసుకోలేక, పైగా వేరొకరు తనను ఆకాశానికెత్తితే బాగుండునని కోరేవానికంటే ఆత్మవంచకుడు వుండడు. పొగడ్తను ఆశించే నీచలాలస ఏనాటికీకూడ సుగుణం కానేరదు, ఆలాలసను తృప్తిపరచు కొనే నిమిత్తం నువ్వు భట్రాజుల కిచ్చే డబ్బు దానంకాదు – లంచం.

లక్ష్మి:—వితండవాదన–దారి, డొంకా ఉంటేనా? లంచంట, లంచం.

వెంకయ్య:—లంచంకాదా? నీమిల్లులోని కూలీలను నానా అగచాట్లు పెడుతున్నావ్! వారిఘోష వినే దాతలేడు. పైగా నిన్ను పొగడడానికిగాను లంచాలిస్తున్నావ్. వాగుడు యంత్రాలను చేరదీసి ప్రపంచం మీదికి వదలుతున్నావ్. ఇంతేనా?

లక్ష్మి:—నా మిల్లులోని కూలీల గొడవ నీకు దేనికి? పని చేసేదివాళ్లు, చేయించుకొనేవాణ్ణి నేను. మధ్యనీకు దేనికి?

వాళ్లు తమకష్టాలన్నీ నీదగ్గర మొరపెట్టుకొన్నారేమో నాకు తెలియదు గాని, నా మిల్లు విషయం నీకనవసరం.

వెంకయ్య:—నీమిల్లువిషయం నాకు దేనికి? అంటూ కావస్తే నీవిషయంకూడా నాకనవసరమే. కాని, నీవు ధాన్యందొంగ నిల్వచేసి Black Market వ్యాపారం సాగిస్తున్నావని తెలిసింది ఇది మాత్రం మనసంఘానికి తీరని కళంకం— దేశానికి ద్రోహం.

లక్ష్మి:—సర్వాబద్ధం.

వెంకయ్య:—(నవ్వుతూ) నేనేం కుర్రాడినా, నీ మాటకు మోసపోవడానికి, నీబెదరింపులకు దడవడానికి? చూడు నరసయ్యా! నీకుజ్ఞాపకం ఉన్నదా? మనం చిన్నతనంలో అయిదారుగురం కలిసి బడి యెగ్గొట్టి కాలవగట్టుకు వెళ్ళాం. దోవలో అందరం తలో అణాకు వేరుశెనగ కాయలు కొనుక్కుపోయినాం. మేము మా కాయలు తిన్నాంగాని, నువ్వు తినక దాచిపెట్టి, మా కాయలు అయిపోయినతర్వాత ఒక్కొక్కటే తినడం మొదలు పెట్టావ్. మేము ఉండబట్ట లేక, నాలుగు కాయలు పెట్టమంటే, నీకి నాలుగు కాయల చొప్పున ధరకిమ్మావ్!

లక్ష్మి:—అదేదో చిన్నతనం.

వెంకయ్య:—మనిషి ప్రకృతి బాల్యంలోనే తెలుస్తుంది గాని,

అతను పెద్దనాను కాగానే ప్రకృతిని వానివేసి, కృత్రిమ భావాలను నటిస్తుంటాను.

లక్ష్మి:—నాకు వేదాంతం తెలియదు.

వెంకయ్య:—రుచించని విషయం ఏదీ తెలియదు.... ఇంతకు నేను నీకు ఒక్కటే విషయం చెప్పదలచుకొన్నాను. తిండి లేక దేశంలో కులాది ప్రజలు మలమలమాడి పోతున్నారు. ఈ సమయంలోనే విశేషలాభం కోసం తాపత్రయపడడం మానవతారుణ్యం గలవాడు చేయవలసిన పని కాదు.

లక్ష్మి:—సర్లెండు, చేస్తాను. అన్నయ్యా! తనకు మాలిన ధర్మం లేదుగా?

వెంకయ్య:—దానివలన యితరులకు హానిలేకపోతే—

లక్ష్మి:—అదంతా నాకు తెలియదు. నీకేం పిల్లాపాపా లేరు. ఉన్నదంతా గ్రామసౌభాగ్యమనీ, ప్రజాశ్రేయస్సనీ, ఏవో ఆస్పత్రులకు, అన్నసత్రాలకు తగలేస్తావు. కాని, నేను పిల్లలు కలదాన్ని; నాకొక బాధ్యత ఉన్నది. నాతరువాత వాళ్ళకేం కావాలని నేను ఆలోచించుకోవాలి. నామీద ఆధారపడివున్నవారికి కాస్త అధరువు చూపించాలా?

వెంకయ్య:—దాన్ని కాదనను.

లక్ష్మి:—ఇక వాదనేముంది? ఏదో నాలుగు డబ్బులు మిగల్చాలని తాపత్రయపడటం తప్పా?

వెంకయ్య:—దురాశకూడదంటున్నాను. దేశంలో లక్షలాది 'అన్నమో' అని అలమటించి, చచ్చిపోతున్నప్పుడు—

లక్ష్మి:—అన్నయ్యా! గవర్నమెంటు వుండగా ఆ గొడవలు మనకు దేనికి?

వెంకయ్య:—తోటి మానవులపట్ల నీకేమీ బాధ్యతలేదా?

లక్ష్మి:—నా బాధ్యతను గవర్నమెంటుకు అప్పగించాగా!

వెంకయ్య:—ఆగవర్నమెంటు దొంగనిల్వలు కూడదంటున్నది గదా? నువ్వు ధాన్యం దాయడం తప్పనా?

లక్ష్మి:—క్షామానికి పోయిన గవర్నమెంటే, కారణం.

వెంకయ్య:—మళ్ళాయిలా వాదిస్తున్నావ్? ...... పోనీ, గవర్నమెంటుకు నువ్వు అప్పగించే బాధ్యత ఏమిటి? క్షామం కల్పించడమేనా? చూడు నరసయ్యా! దేశంలో క్షామానికి విదేశప్రభుత్వం, యుద్ధం కారణాలు కావని నేననడం లేదు. నిల్వసౌకర్యాలు లేకపోవడం, దానివలన ఏడాదికి కనీసం 35 లక్షల టన్నుల ధాన్యం ఎలుకల పాలుకావడం – ఇవీ కారణాలే! వీటి నిర్మూలనానికి ప్రయత్నించాల్సిందే – కాని, ఇట్టి దుస్థితిలో స్వదేశీయులపట్ల మనకు బాధ్యత వున్నదంటున్నాను. ఎవరి మట్టుకు వారు ధాన్యం దాచివేస్తే, మార్కెట్లో ధాన్యం వుండదు; ధరలు మండి పోతవి. నీవు దాచిన ధాన్యాన్ని విడుదలచేస్తే కొన్ని వందల ప్రాణాలు రక్షింపబడులవని అంగీకరిస్తావా?

లక్ష్మి:—నిల్వదారులు తమ దగ్గిర ధాన్యం విడుదలచేస్తే ప్రభుత్వం కొంటుంది. విదేశాలకు, సైన్యాలకు పంపుతుందిగాని, ప్రజలకు చేరదుగదాంట?

వెంకయ్య:—దేశంలోని దొంగలనిల్వదారులంతా తమ ధాన్యాన్ని విడుదలచేస్తే,విదేశాలకుపంపినప్పటికీ, దేశంలో కావలసిన ధాన్యం ఉండిపోగలదు. చరిత్ర ఈ సత్యాన్ని నిరూపిస్తున్నది. విదేశప్రభుత్వంలో సాగుకు తగిన సదుపాయాలు పూరాగా లేవు గనుక అక్కడక్కడ పంటలు లేకపోవడం జరుగుతున్నది కాని, లేకపోతే మనకు కొదవేమిటి?

లక్ష్మి:—నీవాదన నాకు నచ్చలేదు.

వెంకయ్య:—నచ్చదని నాకు తెలియదూ? ఎందుకు నచ్చుతుంది? స్వార్థపరుడికి ధర్మం తలకెక్కుతుందా? త్రాచుపాముకు దయ కలుగుతుందా?

లక్ష్మి:—అంతకోపమెందుకు గాని, నేనొక్క విషయం అడుగుతాను. చెప్తావా?

వెంకయ్య:—ఏమిటది?

లక్ష్మి:—దొంగనిల్వలు కూడదని ప్రచారం ప్రారంభించావ్? నువ్వు కాంగ్రెసువర్కరువా?

వెంకయ్య:—లేదు.

లక్ష్మి:—కమ్యూనిష్టుల్లో చేరావా?

వెంకయ్య:—(లేదని తల వూపుతాడు)

లక్ష్మి:—పోనీ, రాడికల్ ...

వెంకయ్య:—ఏ పార్టీవాడినీ కాదు. ప్రజాసేవ చేయడానికి పార్టీలో వుండి తీరక్కరలేదు. 'శరీరమాద్యం ఖలు ధర్మ సాధన' మని కాళిదాసు చెప్పినట్లు, దేశంలో నలుగురు బ్రతికివుంటేనే స్వరాజ్యంగాని, స్వాతంత్ర్యంగాని.

లక్ష్మి:—అయితే నానీ పార్టీవాడివా ?

వెంకయ్య:—అదీ గాదు - ఈ విశాలప్రపంచంలో రెండే రెంటికి జాతి, కుల, వర్ణ, రాజకీయాలతో ప్రసక్తిలేదు - ఒకటి ఆకలి, రెండవది చావు. ఆకలితో కడుపుదహించుకు పోతున్న సమయంలో రాజకీయాలెవరికి కావాలి ?

లక్ష్మి:—ఇల్లుకూడా తాకట్టు పెట్టేశావుటగా ?

వెంకయ్య:—తగువాత అమ్మివేశానుకూడా. చిన్నగుడిశెలో కాలక్షేపంచేస్తూ, మిగతాడబ్బు క్షామనివారణ నిధికి యిచ్చాను. తిండిలేక నేనుకూడా చావవలసివస్తే లక్షలాది అమాయకులతో సంతోషంగా కలసిపోతాను.

లక్ష్మి:—ఇటీవల వూళ్లో లేవుటగా ?

వెంకయ్య:—అవును. ఆకలిమంటలకు తట్టుకోలేక 'అన్నమో' అని పలవరిస్తూ ఘోరంగా చనిపోతున్న పేదలనుచూచి, చేతనైన సహాయం చేయాలనే అభిలాషతో తిరుగు

తున్నాను. నిన్ను తప్పుదారినుంచి తప్పించి దొంగలాభాల పై మనస్సుపోకుండా చేయాలని వచ్చాను.

లక్ష్మి :—నాదేమిటి ? సముద్రంలో ఉద్ధరిణెడు నీళ్లు.

వెంకయ్య :—ఉడతాభక్తికే ఫలితం.

లక్ష్మి :—త్వరగా స్నానం చేయి. భోంచేసినతర్వాత మాట్లాడుదాం.

వెంకయ్య :—ముందొకసారి అలా బజారు వెళ్ళి వస్తా. (పోబోతాడు)

లక్ష్మి :—చూడు అన్నయ్యా! నువ్వు నాతో మాట్లాడిన విషయాలు మరెవ్వరితోనైనా అనేవుసుమా ! గోరంతలు కొండంతలుచేసి ఊళ్లోవాళ్లు నామీద పోలీసులకు రిపోర్టు యిస్తారేమో!

వెంకయ్య :—అది జరగకుండా చూడాలనేగా నేనొచ్చింది.

లక్ష్మి :—త్వరగా తిరిగి రావాలిసుమా !

వెంకయ్య :—ఇక్కడున్నట్టు రానూ !

లక్ష్మి :—పొరబాటునైనా ఆ ప్రస్తావన చేయకు _కొంప మునిగిపోతుంది.

వెంకయ్య :—నాకు తెలియదట్రా !

లక్ష్మి :—త్వరగా తిరిగిరావాలి !

వెంకయ్య :—అలాగే.

లక్ష్మి :—నేనుచెప్పింది జాగ్రత్త !

**వెంకయ్య:**—ఇంత భయపడేవాడికి అంత కక్కుర్తి దేనికి!
(వెళ్ళిపోతాడు. లక్ష్మీనరసయ్య ఆలోచిస్తూ అటూ యిటూ పచారుచేస్తూవుండగా బుడ్డోడు వస్తాడు.)

**లక్ష్మి:**—నువ్వెవరు?
(బుడ్డోడు నోరు తెరుచుకు చూస్తూ నిలచుంటాడు)

**లక్ష్మి:**—ఎవరు నువ్వు?
(బుడ్డోడు 'ఇ ఆ' అంటాడు)

**లక్ష్మి:**—ఎవరునువ్వంటే మేకలాగా 'మే, మే' అంటావేమిటి? అడుగుతున్నది నిన్నుకాదూ!
(బుడ్డోడు చూస్తూ నిల్చుని వుంటాడు)

**లక్ష్మి:**—(బిగ్గరగా) ఎవరునువ్వు?
(బుడ్డోడు చూస్తూ నిల్చుంటాడు.)

**లక్ష్మి:**—పో, అవతలికి, వెధవ! (అంటూ చేతితో తనకు తెలియకుండానే సౌంజ్ఞ చేస్తాడు)
(బుడ్డోడు గ్రహించి 'పోనా? వెళ్ళను. ఇక్కడే వుంటాను' అని సౌంజ్ఞ చేస్తాడు.)

**లక్ష్మి:**—వెర్రివేషాలువేస్తావ్! పో ముందు!
(బుడ్డోడు క్రింద చతికిలబడతాడు)

**లక్ష్మి:**—అరినీదుంపతెగ! చెవిటేనీకాదూ? చెవుడా? నోరు లేదా? ————— అన్నట్లు పుల్లడి కొడుకాదూ?

మూగోడు కాబోలు. ---- మూడురోజులనుంచి తిండి లేదు. గుడిసెలోపడుండక వూరివెంట పికార్లెందుకో, చస్తారంటే చావరూమరి! వెళ్లిపో! (సౌంజ్ఞ చేస్తాడు)

(బుడ్డోడు 'వెళ్ళను! అరటిపండివ్వు' అని పండ్లు చూపుతూ సౌంజ్ఞ చేస్తాడు)

లక్ష్మి:—పండుకావాలీ నీముఖానికి? మాటలేకపోయినా సాపాటుకు లోపంలేదు. ఊఁ ... ఇంద ...

(అరటిపండు తీసి యివ్వొస్తాడు. బుడ్డోడు దణ్ణంపెట్టి రెండు చేతులుజాస్తాడు.)

లక్ష్మి:—దండంపెట్టడంకూడా తెలుసే! ఆహా! సరే ... తీసుకో ... (తన కాళ్లముందర కొద్దిదూరంలో పండు పడేస్తాడు. బుడ్డోడు నేలమీదవాలి తీసుకోబోతాడు. ఈలోగా లక్ష్మినరసయ్య పండుతీసుకొని నవ్వుతుంటాడు. బుడ్డోడు తలెత్తి దీనంగా చూస్తుంటాడు.)

లక్ష్మి:—అచ్చంగా కుక్కలాగా చూస్తున్నావురా! లే, నిలుచో! (సౌంజ్ఞ చేస్తాడు.)

(బుడ్డోడు లేచి నిలుచుంటాడు.)

లక్ష్మి:—కూచో! (సౌంజ్ఞ చేస్తాడు.)

(బుడ్డోడు కూచుంటాడు.)

లక్ష్మి:—(నవ్వుతూ) నిలుచో! (సౌంజ్ఞ చేస్తాడు)

(బుడ్డోడు మెల్లిగా లేస్తాడు. చూపులు పండుమీదే)

లక్ష్మి:—(నవ్వుతూ) కూచో! (సౌంజ్ఞ చేస్తాడు)

(బుడ్డోడు మెల్లిగా కూలబడతాడు. చూపులు పండు మీదే. ఇదే విధంగా లక్ష్మి నరసయ్య నాలుగుసార్లు బుడ్డోడి చేత గుంజీలు తీయిస్తాడు.)

లక్ష్మి:—(బిగ్గరగా నవ్వుతూ) నిలుచో!

(బుడ్డోడు ఆయాసంతో మెల్లగా లేవబోయి, పడి పోతాడు. చాలా దీనంగా పండువంక, నరసయ్యవంక చూస్తాడు. నరసయ్య బిగ్గరగా నవ్వి, పండువలిచి తానుతిని, తోలు క్రింద పారేస్తాడు. బుడ్డోడు అది తీసుకు తింటుంటాడు. లక్ష్మి నరసయ్య విరగబడి నవ్వుతుంటే – వెంకయ్య వస్తాడు.)

వెం:—(కఠినంగా, తమ్ముని ఉద్దేశించి) ఛీ! పశువా!

లక్ష్మి:—(ముందు తెల్లమొగం వేస్తాడు. తరువాత తల వాల్చాడు.)

వెంకయ్య:—సిగ్గులేదూ? గుండె – కటికరాయా!

(బుడ్డోడు వెంకయ్యను చూచాడు. సంతోషంతో బుజాలెగరేస్తూ, అరటిపండుతోలును జూపి, లక్ష్మినరసయ్యను చూపించి, నమస్కారం పెడతాడు. వెంకయ్యకు ఇది జూచే సరికి కళ్ళనీళ్ళ పర్యంతమైంది. వొణుకుతున్న చేతులతో బుడ్డోణ్ణి సాదరంగా బుజంమీద తట్టాడు—)

వెంకయ్య:—పిల్లికి చెలగాటం, ఎలుకకు ప్రాణసంకటం — నీ తెలివితేటలన్నీ చూపించడానికి ఈ నోరులేని నిరుపేద దొరికాడా? పనికిమాలిన వెధవలాగా, పశువులాగా ప్రవర్తించావే గాని, నీలో ఏకోశానైనా మానవత్వం వుందా? శవాన్ని పీక్కుతినే గద్దకు, నీకు భేదమేమిటి?

లక్ష్మి:—అసలు విషయం పూర్తిగా తెలుసుకోకుండా ...

వెంకయ్య:—నా కళ్ళు చిల్లులు పడిపోలేదు! —

లక్ష్మి:—మామ అన్నయ్యా? వాడికి నేను అగపడిందంతా యిచ్చాను. తోబుట్టినడం మాత్రమే కాదు, నువ్వు నామీద నోరు చేసుకోవడం బాగాలేదు.

వెంకయ్య:—తప్పుడుపనికి చింతించకపోగా, పైగా తప్పుడు కూతలుకూస్తున్నావా?

లక్ష్మి:—యథార్థం చెప్పాను. అంతే.

వెంకయ్య:—ఛీ! అబద్ధాలాడతావ్! ఇంత లజ్జ లేకుండా పోయిందేం?

లక్ష్మి:—మాటలు కొంచెం జాగ్రత్తగా రానీ!

వెంకయ్య:—నోరు మెదపకు. ఎందరో ఎన్నో విధాలుగా నిన్ను గురించి చెప్పినప్పటికీ, చెప్పుడుమాటలేమో ననుకుంటూ వచ్చాను. నీనిజావతారాన్ని ఇవ్వాళ కళ్ళారా చూచాను. నా[illegible] చెప్పుకోడానికి సిగ్గుపడుతున్నాను. నిన్నేం చేస్తే పాపముంది?

లక్ష్మి:—నేను చేసింది పొరబాటేకాని, పరాయివాడు వుండగా నువ్వు నన్నిలా కేకలేయడం బాగావుందా? రేపట్నుంచీ నేనంటే వాడికి చులకనకాదూ? ఇక నాకేమైనా పరువుంటుందా?

వెంకయ్య:—మనుషుల్ని పీక్కు తిని, పరువు సంపాదించుకుంటున్నావా? గొప్పపరువే!

లక్ష్మి:—నేను చేసింది పొరబాటే నంటేనిగా ... ఎందుకు వాదన! పోనిద్దూ!

వెంకయ్య:—నాలిక చివరి మాటతో ప్రయోజనమేమిటి?

లక్ష్మి:— కాదు - హృదయ పూర్తిగా అంటున్నాను. నాదిపొరబాటే!

వెంకయ్య:—అయితే నేను చూస్తుండగా వాడికో అరటిపండిచ్చి పొరబాటేనని చెప్పుకో!

లక్ష్మి:—అరటిపండివ్వడానికేం? ఇంతేగదా! (బల్లమీద మిగిలివున్న మూడుపండ్లు తీసుకుంటాడు. తరువాత ఏమనుకున్నాడోగాని రెండుపండ్లు బల్లమీద పడవేసి, ఒకటి మాత్రం బుడ్డోడికి అందివ్వబోతాడు. బుడ్డోడు చేతులు జాస్తాడు—)

వెంకయ్య:—ఆ రెండుపండ్లు కూడ యిస్తే, ఇంతలో నీ ప్రాణాలేం పోవులే! ఇచ్చివెయ్యి.

లక్ష్మి:—అవినీకోసమని వుంచాను. అంతేగాని—

వెంకయ్య:—ఎంతవాత్సల్యం! భరతుడి తరవాత నువ్వే భ్రాతృప్రేమకునిదర్శనం! అఘోరించావుగాని, అవి కూడ ఇచ్చేయ్!

లక్ష్మి:—(అరటిపళ్లు రెండుకూడ చేతతీసుకొని, మూడిటినీ బుడ్డోడికిస్తాడు. వాడవి తీసికొని నమస్కారంపెట్టి తింటుంటాడు)

వెంకయ్య:—ఇందాక చేసింది పొరబాటనిచెప్పు!

లక్ష్మి:—వేరేచెప్పాలా ఏమిటి? అరటి పళ్లిస్తినిగా! దాని కర్థం అదే!

వెంకయ్య:—అర్థమదే అయితే, పొరబాటన్నమాత్రాన నీనోట్లో మంచిముత్యాలు రాలిపోవుగా?

లక్ష్మి:—నాపరువు తీసేస్తున్నావ్! నాస్థితిలో నువ్వుంటే, నాఅవస్థ నీకు తెలుస్తుంది. పూటకూటికి గతిలేనివాణ్ణి క్షమాపణకోరేదా?

వెంకయ్య:—వాణ్ణి కుక్కనులాగా ఆడించినప్పుడు, ఆ మాత్రం మాట అనలేవూ?

లక్ష్మి:—అనను.

వెంకయ్య:—అనవా?

లక్ష్మి:—నువ్వేం చేసినానరే అనను.

వెంకయ్య:—వాడితో ఆమాట అనడం, నీగొప్పతనాన్ని చూపుతుందికాని, నీపరువు తీసెయ్యదు.

లక్ష్మి:—వాడలా ఆలోచిస్తాడా?...

వెంకయ్య:—కూ గమాయురా! నువ్వేమన్నా వాడికి తెలియదు. ఆ విషయం మర్చిపోయావేమో!

లక్ష్మి:—ఇది నాకెందుకు? నా అంతరాత్మ ఎంతకుంగిపోతుందో తెలుసా? ఆ మాటలనడానికి ఎంత బాధ పడుతుందో ఊహించావా?

వెంకయ్య:—నీకు అంతరాత్మకూడా అఘోరించిందా?

లక్ష్మి:—అసలేమిటి నీఆజ్ఞ నాకు? అన్నావుగదా అని వస్తాయిస్తున్నకొద్దీ—

వెంకయ్య:—ఆ! తరువాత?

లక్ష్మి:—చాలించు ఇక; నాగొడవ నీకెందుకు?

వెంకయ్య:—పొరబాటని వాడితో అంటావా? లేదా?

లక్ష్మి:—ఇదివరకనడమేతప్పు. పైగా మళ్ళీఅంటానా?

వెంకయ్య:—అంటావా? లేదా?

లక్ష్మి:—బెదిరిస్తావేమిటి? మహాఘనకార్యం నువ్వు బాగా చేస్తున్నావులే!

వెంకయ్య:—ఇట్లారా!

లక్ష్మి:—ఎందుకు?

వెంకయ్య:—ఎందుకూ? దవడపగ లేయడానికి! రా ముందు! ... ఏమిటట్లాచూస్తావు? ... ఛీ! పో అవతలికి! నీ ముఖం చూస్తే పంచమహా పాతకాలు చుట్టుకుంటయ్!

లక్ష్మి:—ఇవాళ నీముఖం చూడ్డం వల్లనే ఇంత ముప్పొచ్చింది!

వెంకయ్య:—నోర్ముయ్! (ఈ కేకతో పాటు వెంకయ్యచేయి కదిలింది. బుడ్డోడుచూచి నిర్ఘాంతపోయాడు)

లక్ష్మి:—ఏమిటాజులుం? ఇక మర్యాదగా వుండ దేమను కున్నావో?

వెంకయ్య:—అట్టే వాగావంటే—(చెయ్యెత్తాడు. కొట్టబో యాడుకూడా—కాని—చెయ్యి మధ్యలోనే ఆగిపోయింది. కోపాన్ని దిగమ్రింగుకుంటున్నాడు)—వెళ్ళిపో ... నేను త్వరపడ్డాను... ...పొరబాటు... వెళ్ళిపో... ...

లక్ష్మి:—ఆ దెబ్బపడితే తెలిసేది. (ఇంటిలోపలికి వెళ్ళాడు. వెంక య్య ఒక్క కనురెప్పపాటు సేపు అలాగేవుండి, ఎత్తివున్న చేతిని దింపి, లక్ష్మీనరసయ్య పోయిన దిక్కుకే చూస్తూ నిలుచున్నాడు. బుడ్డోడు అతనివంక చూస్తున్నాడు.

—( తెర )—

---

# ఇదీ లోకం!



1 వ అంకం — రెండవ రంగం

(గతరంగానంతరం కొద్దిసేపే అయింది గనుక అంతా యధాపూర్వంగానే వున్నది. బుద్ధోదయమాత్రం లేదు. వెంకయ్య తదేకదృష్టిగా చూస్తూ ఏదో గాఢంగా ఆలోచిస్తున్నాడు. దూరంనుంచి తాతపాట మాత్రం వినిపిస్తున్నది.)

తాతకంఠస్వరం (లోపలినుంచి):—

నిజము, నీతి, విలువలేని
నీచలోకమిది గాదా ? ॥నిజ॥

ధనమెనీతి, ధనమెజాతి
ధనమె సర్వముగాదా యీభువి
వలదీలోకము, పదరాపోదము
స్వామ్యలోకమే లక్ష్యమురా! ॥నిజ॥

కష్టము సుఖమో తర్కమదేలా ?
ఇంతనీచము సహియించేవా ?
మనకు మాడినా, పిల్లలకైనా
మనుగడ తథ్యము పదరా ! ॥నిజ॥

(పాటవిని వెంకయ్య, తను ఆమోదించినట్లు తల ఊపుతాడు. ఇంట్లోనుంచి లక్ష్మీనరసయ్యవచ్చి వెంకయ్యను జూచి, పెడ మొఖంపెట్టి నిలమంటాడు. ఒక్కనిమిషం ఇద్దరు అలాగే నిలుచున్నారు.)

లక్ష్మి:—ఊ!

వెంకయ్య:—(తమ్ముని జూచాడు. కాని మాటలాడకుండా కున్నాడు)

లక్ష్మి:—ఇవాళ చాలా ఇదిగావున్నది!

వెంకయ్య:—(సమాధానంలేదు)

లక్ష్మి:—అన్నయ్యా!

వెంకయ్య:—ఏమిటి తమ్ముడూ?

లక్ష్మి:—స్నానంచెయ్యి భోంచేద్దాం. నాకు మిల్లుకు టైము అవుతున్నది.

వెంకయ్య:—ఇవ్వాల్టికి కడుపునిండిపోయింది.

లక్ష్మి:—అన్నదమ్ములం పరాయివాళ్ళముందు కలహించడం బాగావుంటుందా? నువ్వు నన్ను ఏవో అన్నావని నాకు కోపంలేదు గాని, నువ్వు త్వరపడ్డావు అన్నయ్యా! విశేషలాభాలనే పదానికి అర్థంలేదు. ఎక్కడికక్కడే విశేషలాభం. దానికి హద్దులంటూలేవు. అటువంటప్పుడు నిజస్థితి తెలుసుకోకుండా నన్నుతూలనాడడం...

వెంకయ్య:—Black market వ్యాపారం పెట్టుబడి (Capitalist) విధానానికి విశేషవిషస్వరూపం. అంతే. పెట్టుబడి విధానమే నశించాలి. శ్రమజీవులకు శాంతి సౌఖ్యాలు లభించాలి.

లక్ష్మి:—ఇదంతా ఉపన్యాసవేదిక ఎంచి చక్కగా వినిపిస్తుంది. ఆచరణలో ఎదురుతిరుగుతుంది ... దానికేమిటిగాని, ఇప్పటికే ఊళ్ళోవున్న పనిలేని సోమారులందరు నామీద కత్తిగట్టారు. నువ్వుకూడ నాకు వ్యతిరేకంగా మాట్లాడితే వాళ్ళకు అలుసెక్కువవుతుంది. మనమిద్దరం ఆలోచించి ఏది తగునో చూచి అలాగే చేద్దాం. నీమాటకాదంటానా!

వెంకయ్య:—ఈ నక్కవినయాలు తీసి అవతలపెట్టు. నిజం చెప్పడంనీ ప్రకృతికే విరుద్ధం — నిన్ను ఈ క్షణమే అరెస్టు చేయించాలనీ, ఏదో విధంగా శిక్షించాలనీ నాకున్నది. కాని తటపటాయిస్తున్నాను — కారణం తెలుసా?

లక్ష్మి:—ఒక్క కడుపున పుట్టినవాళ్ళం కావడమేనా ?

వెంకయ్య:—కాదు — మనల నిద్దరిని కన్నకడుపు ఇంకా బ్రతికి వుండడమే కారణం — నిన్నేమైనా చేయిస్తే అమ్మ యెంత బాధపడుతుందో నాకు తెలుసు. నువ్వేమో బాగోగులు విచారించకపోయినా, కనీసం నాయింటి చాయలకువచ్చి చూడకపోయినా, కన్నకడుపు గనుక నన్నామె ప్రేమిస్తునే వుంటుంది. ఇప్పుడు నిన్ను నేనేమైనా చేయిస్తే అమ్మ నన్ను

తుడిచలేదు. కనుక నిన్ను సన్మార్గంలో పెట్టడానికి పూర్తిగా ప్రయత్నించి, ఆతరువాతనే తగుచర్య తీసుకుంటాను.

లక్ష్మి:—అలాగే. ఇంతే కద? తీరిగ్గా మాట్లాడుదాం. ముందుస్నానం చెయ్యి.

(వెంకయ్య ఇంటిలోనికి వెళుతాడు).

లక్ష్మి :—[అటూఇటూ పచార్లుచేస్తూ - మెల్లిగా-]

"ఉ॥ చెల్లియొ, చెల్లకో, తమకు చేసిన యెగ్గులు సైచిరందరున్,

తొల్లిగతించె ... ...

(పెద్దోడువచ్చాడు. కాలువిరిగింది. చంకల్లక్రింద కర్రలేసుకొని వస్తాడు.)

లక్ష్మి:—ఏంరా? పెద్దోడా? ఏమిటిఇలావచ్చావ్?

పె:—మాబుద్ధో ముందాడేమోనని ...

లక్ష్మి:—ఇంతకుముందే వెళ్ళాడు.

పె:—మూడు రోజులాయె ధారకం లేకుండి. "వద్దురా, ఎల్ల బోకరా!" అంటే యినోడు కాడండి.

లక్ష్మి:—అవును పాపం! ఒంట్లో శక్తిలేక పడిపోతే, నాలుగు అరటిపండ్లూ అవ్వీ తినిపించి ఇంతకుముందే పంపించాను. చూసు. లేనిపోనిది యుద్ధానికెళ్ళి కాలిరగ్గొట్టుకోకుండా

వుంటే మీఅయ్యకు చేదోడు వాదోడుగా వుండేవాడివి గదా?

పె:—యుద్ధంలోకి సంతోసంగా ఎల్లామనుకుంటుండారా?

లక్ష్మి:—అందుకు సందేహమా?

పె:—అంతాపొట్టకోసమేనండి. ఎక్కడో యింగ్లీసోడికీ జర్మనీ వోడికీ యుద్ధమైతే మాకేంటండి? ఇంగ్లీసో: ఫున్నమాని మాకు కూడులేకుండా పోయిందగన యుద్ధానికి కళ్ళాం గాని, లేకుంటే యుద్ధాలు మాకేటికండి? ఇది మాపిండా కూడు యుద్ధం బాబూ!

లక్ష్మి:—ఇక్కడవుండి కాయకష్టం చేసుకుంటే మాత్రం పిండాకూడు లేదట్రా?

పె:—ఇరవై నాలగ్గంటలూ పనిచేసినోళ్ళం చేసినట్టేవున్నా, ఎవళ్ళెన్నిమాటలన్నా పడున్నాకూడా చేతికి దొరికే కూలి డబ్బు సాలదండి. తిన్లు తినే పనిలేకుండా ఎక్కడో బువ్వ దొరుకుతుందంటే, పంజరంనుంచి పోయే శిలకలాగా మాపాణం లేసొస్తదండి. పటాలంలో కులాల్లేవండి. ఆడు న్నంతసేపు మేము కూడా మడుసులమేననిపిస్తదండి! అది చాలదాండి మాకి కుపు నిండడానికి!

లక్ష్మి:—ఏమిరోయ్! ఆ! చక్కగా మాట్లాడుతున్నావ్! పెద్ద పెద్దభావాలు విసిరేస్తున్నావ్!

పె:—పటాలంలో మూకు సదువుండాదండి. సదువుకున్నోరు
కూడా సాటివారికిమళ్ళీ కలిసుంటారండి.

లక్ష్మి:—ఆగ్నెల్లు వార్ని పక్కన వీరుంటే, వీరు వారైనారన్న
మాట! ఆ! నీలో ఎంతమార్పు వచ్చిందిరా?

పె:—నూడండయ్యా! యుద్ధంనుంచి తిరిగొచ్చిన కాడ్నుంచి
నేను పడే బాధ యింతింత కాదండి.

లక్ష్మి:—పాపం అపాటి కాలు కదూ!

పె:—అ[illegible]దండి — మళ్ళీ అవిటి బ్రతుకేనా అని
అటుమాటించి చస్తన్నానండి. ఎన్నోదేశాలుచూశాం.
ఎక్కడెక్కడ దేశంలో ఎన్నో యిళ్ళ శేసాలు, యింటలుచూశాం.
కొత్తసంగతులు నేర్చుకున్నాం. దినామూ పటాలాన్నికూడ
దీసి, యీ యుద్ధం ప్రజాసౌఖ్యం కోసమనిసెప్పేవారండి.
యుద్ధంలో గెలిచినాక ప్రపంచకంలో ఎక్కువ తక్కువ
లుండవనీ, అందరికీ హాయిగా బతుకు తెరువుంటుందనీ
సెప్పేవారండి. అవన్నీ విన్నాం — తిరిగొచ్చాం — ఇక్కడ
మాత్రం తిడతంటే తలొగ్గితేకాని యిప్పుడుకూడ మాకు
ఆబకపూట తిండిదొరకదండి! కాయకష్టం చేసేవోడికింకా
అన్యాయమే జరుగుతున్నాదండి.

లక్ష్మి:—నీతో యిదంతా మాట్లాడవలసిన అవసరం నాకేం
లేదనుకో, కాని, నాఅభిప్రాయంకూడ చెప్తాను వింటావా?
విని, నీకునచ్చితే, మీవోళ్ళకు నచ్చచెపుతావా?

పె:—అంతకంటేనా దొరా !

లక్ష్మి:— నిజం చెపితే, కాయకష్టం చేసే కూలోళ్లు వీళ్లంతావున్నారే మా ప్రాణాలుతో డేస్తున్నారంటేనమ్మరా! ఏవో సంఘాలనీ, సమ్మెలనీ ప్రారంభించారు. ఇదివరకు ఒళ్ళువంచి పనిచేసేవాళ్లంతా, యిప్పుడు రొమ్ముమిరుచుకు నిల్చుని, రెట్టింపుకూలీ అడుగుతున్నారు. నమ్మతావో, నమ్మవో గాని యిదివరకు బియ్యపుబస్తా బండిమీదనుంచి తెచ్చి కొట్లో గుమ్మరిస్తే కానీ యిచ్చామనుకో, యిప్పుడా పనికే అణా అడుగుతున్నారు. రోజులెంతగా మారి పోయినవో చూస్తే ఆశ్చర్యం వేస్తోంది. ఇంతవరదాకా యిక్కడేనా వున్నదనిపిస్తుంది. ఇన్నింటికీ నప్పుకుంటామా, వల్లెత్తుమాట అన్నామో, ఇంకొక్కడిది, సమ్మెకట్టేస్తారు. పెట్టి పోషించేవాళ్ళం మేము ఒకమాట అనడం తప్పా ? ఇప్పుడు వీళ్లు సమ్మెకడితే ప్రపంచం తల్లక్రిందులై మూపను లాగిపోవుకదా ? వీళ్ళు కాకపోతే వీళ్ల తాతలను రప్పించ గలం. అవసరం వస్తే, పోలీసువాళ్లు వున్నారనుకో! కాని, మనుష్యులను యింతగా ఆశ్రయించు కున్నవాళ్ళమీదయిలా చేయిచేసుకోడం మా కెంతో బాధగా వుంటుంది.

పె :—ఇస్తన్నాం, పోషిస్తన్నాం అంటన్నారుగాని, మీ కూలోళ్ళ గుడిసెకొక దానికి పోయి వాళ్లెలాబతుకు

తుండారో సూడండి! వాళ్ళ గుడిసెలంటె మీపాకీదొడ్డి సుబ్రంగా వుంటుందే! వాళ్లు పనిలోవంచేస్తన్నారంటే, మీరు సరిగా కూలివ్వక, వాళ్ళచేత ఆపని చేయిస్తుండారు. దయా ధర్మం యింకా మాలోవుంది గానివ్వండి, డబ్బున్న వోరికి పిసరైనా లేదు. ఆ గుడిసెల్లో వున్న పసిపిల్లల్ని అన్నిరోగాలు పీక్కుతింటే తినవాండి? అలాగే గంజైనా ఆ గుడిసెలో తిన్నగా యిముడుద్దాండి? మీరు సెప్పండి. మిమ్మల్ని నమ్ముకున్నవోళ్ళకు, సంవత్సరాల తరబడి మీ కోసం చెమటూడ్చేవోళ్ళకు ఉండడానికి కొంపలేదే! పొట్టనిండదే! ఒంటినిండాగుడ్డయినా లేదే! ఇది ధర్మమేనా సెప్పండి? ఇంకా నరకమంటూ ఒకటుం దంటారా? ఇదితప్పు!

లక్ష్మి:— ఈ మెట్టవేదాంతం నీబుర్రకెక్కడా బాగా ఎక్కిందే! ఇంకేదో నువ్వు తెలివిగలవాడ వనుకొన్నాను! ప్రయోజకుడవనుకొన్నాను! దయా, దాక్షిణ్యాలు మా దగ్గిర లేకపోతే, నమ్మిచేయంగానే ఆలోచనా, సాలోచనా లేకుండా కాల్చివేయించమూ? ఈమాత్రం తెలియదేం?

వె:— ఇంతకంటే ఎక్కువే తెలుసు! అన్నిటికేచెడి అవిటి బతుకులు బతికేకన్నా సావడమే మేలుండి! సావనీకుండా, సంతోసంగా బతకనీకుండా సాలీసాలని తిండిపెట్టి, నరకంలో మమ్మల్ని ఏదించుకుతినేదానికంటే, ఒక్కసారి కాల్చిం

చేస్తే, మీమేలు మరచిపోగలమాదొరా! నోరువాయలేని వాళ్ళనేక పశువులన్నట్టుగా నానా చాకిరీ చేయించుకొని. పశువుకుపెట్టే తిండైనా పెట్టడంలేదే మీరు!

లక్ష్మి:—పో! నీతోనాకు వాదనేమిటి? (వెక్కి-రిస్తూ) నోరు వాయ లేనివాళ్ళని శాధించుకు తింటున్నారట! వచ్చాడు ధర్మరాజు తీర్పుచెప్పడానికి!

పె:—పోనీలెండి! ధర్మరాజులంటే మీరేలెండి!

(వెంకయ్యవచ్చి నిలుచుని వింటుంటాడు)

లక్ష్మి:—అనవసరప్రసంగం చేయకు! స్వరాజ్యంలో సింహాసనా లెక్కుదురుగానిలే! పో! అవతలికి!

పె:—మాకాపిచ్చికలల్లేవండి! ఇంగ్లీసోడిచ్చే సొరాజ్యం డబ్బుమూలిగేవారికి గాని, మాకు కాదని మాకుతెల్సండి. దేవుడు వరమిచ్చినా పూజారి వరమియ్యడుగా మీరా?

లక్ష్మి:—పో ముందు! అతివాగావంటే కాళ్ళిరగ్గొడ్తాను, ఏమనుకొన్నావో!

వెంకయ్య:—ఇక వున్నదల్లా ఒకకాలే, తమ్ముడూ! ఒకకాలు యింగ్లీషువాడిరగ్గొట్టాడు! రెండోది నువ్వు పుణ్యం కట్టుకో!

లక్ష్మి:—తమ మధ్యవర్తిత్వం నేను కోరలేదు అనవసరంగా మాటలంటే యిక్కడ పడే వారెవ్వరూ లేరు!

వెంకయ్య:—నువ్వన్నమాటలన్నింటినీ వాడు పడ్డాడుగదా! అన్నమాట ఒకటి తమ్ముడవడితే తప్పా?

లక్ష్మి:—కీలాటివాళ్లే మాటలకు ఉరిబోసేది. (చరచరా లోపలికి వెళుతాడు)

(పెద్దోడు ఒకసారినిట్టూర్చి, పోబోతుంటే, వెంకయ్య ఆగవలసిందని సౌంజ్ఞ చేస్తాడు)

వెంకయ్య:—మంచి సాహసంగలవాడవే:

పె:—కాదు బాబూ! అన్నింటికీ తెగించినోణ్ని.

వెంకయ్య:—అంత కష్టంలో ఉన్నావా?

పె:—ప్రపంచకంలో మా మట్టుమల్లి కష్టమేగా బాబూ! అసలే ఎప్పుడూ ఒకపూటతిండేగాని, రెండోపూట గంజె రగం గానికితోసు యుద్ధ ముచ్చె అంతా అయోమయ మైంది. ఎందుకొచ్చిందో తెలియదుగాని కాటకం వచ్చిపడింది. మన్న అయ్యాలకు దిగులులేదు లేని మా మీదే దాని దాడి కూడా! ఈ నరసంహ్యగారు ఎంత ధాన్యం దాచాడో లెఖ్ఖ ఆయనకే తెలియాల! యముడాళ్లు యిక్కడే వుండారు బాబూ!

వెంకయ్య:—మనిషి శాస్త్ర ప్రపంచంచూచి వచ్చిన వాడివి. ఇంతగా ఆవేశపడతావేం? నీ వాదం నిజమైనప్పటికీ ఆవేశం హానికరం. ఆవేశానికి అవసువున్నది నాయనా!

పి:—ప్రపంచకం చూసినాకనే నాకడుపుమంటెక్కువైంది దొరా! ఒక్కొక్కోళ్ళని ఒక్కొక్కఊళ్లోనుంచి తరిమేసి, మావాళ్లలం అవ్వూళ్ళోకి పోతుంటే మమ్మల్ని దేవుళ్లలాగా పూజలుసేశారు. ఏదేశంలో కూడా యిక్కడంత కులం గొడవల్లేవు! ఇక్కడ మాబతుకంతగా ఏ దేశంలో ఎవరి బతుకూ నోరంకాదు

వెంకయ్య:—మళ్ళా ఆవేశపడుతున్నావ్ !

పి:— ఆవేశపడకేంచేసేదిబాబూ! తల్చుకుంటే గుండె పగిలిపోతంది. యుద్ధంలోకి పోయింది మనదేశాన్ని కాపాడ్డానికా్కడే! పూటకూటికి గతిలేక మెళ్ళాం! ఇక్కడ సంగంలో యిసుచెరబరించలేక, దొంగల్లాగా యుద్ధంలోకి పారిపోయాం. యుద్ధంలో సావడం నిజమనేమెళ్ళాం. బతుకుమాట దేవుడెరుగు, ఈ నరకంలోనుంచి బయట పడితే సాలనిమెళ్ళాం! అయినవారందర్ని అర్ధాంతరంగా యిడిసేసి లగెత్తాం!

వెంకయ్య:—మాను, ఆవేశపడకు నాయనా! నువ్వుయుద్ధంలోకి ఎందుకెళ్ళావని నేనడగడంలేదు. అనవసరంగా ఆవేశ పడతావెందుకు?

పి:— ఆవేశంకాదండీ! నాకడుపుమంట మెళ్ళబోసుకుంటుండాను. ఈనిముసంలో హాయిగా ఆడతా,

పాడతా కూర్చుని వుండేవాళ్ళం! ఎక్కడనుంచో, మా
కేమీ తెలీకుండా, పడీ చప్పుడు లేకుండా ఆకాశంలోంచి
బాంబులుపడేవి! అంతే! రోజులునిండినోళ్ళు గాల్లోపోయేవోళ్ళు!
రోజురోజుకూ చావులు చూసీ, చూసీ. చావంటే భయం
పోయిందా! ఇక్కడ అవిటి బతుక్కంటే చావే మేలని
పించేది! బతికి వుళ్ళా యీ బతుకు బతకలేక చావుకోరు
కొనేవాణ్ణి! నాకర్మం! శాలిరగడమెందుకు? తలపగిలి
సచ్చిపోతే బాగుండేది. నేనొక్కణ్ణి సచ్చినంత మాత్రాన
ప్రపంచకానికి లోటేంటి?

వెంకయ్య:—ఆశయూ లేమీ లేకుండా ఉత్తినే చనిపోయారం
టావా యుద్ధంలో?

వె:—— ఆశలు పెట్టుకోని, కొండంత ఆశలు పెట్టు
కోని, పెత్తికలలు కంటూ చనిపోయారు బాబూ! మే
మంతరం యుద్ధంలో సచ్చిపోయినా, గెలిచింతరవాత
ప్రపంచకంలో బీద, బిక్కి వుండదనీ, తిండి గుడ్డ
కరువు వుండదనీ ఆశలునూరిపోశారు. మేం సచ్చినా
మాపిల్లవాలవాళ్లు సుఖపడతారని నమ్మాం! ఆ నమ్మ
కంతో ఎన్నోయేలమంది చావు నిజమని తెలిసికూడా జర్మనీ
వోడి ఫిరంగుల కెదురు లగెత్తారు! ఆకాశం పొట్ట బద్దలై
బాంబులుపడినా కూడా లెక్కలేకుండా యుద్ధం చేశారు.

వెంకయ్య :—కాని, మీరనుకొన్న మార్పేమీ రాలేదు కదా! ఇప్పుడు నిరాశతో కడుపుమండిపోతున్నది! కాని, కొంచెం తాపీగా ఒక్కసారి అంతా పరిశీలించు!

పె :— ఇంకేం చూసేది బాబూ! చావుకోసం ఎదురు చూస్తుండాను.

వెంకయ్య:—ఎందుకంత నిరాశ? నీలాగా భావించినవారు లక్షలున్నారు. తాముచచ్చినా, తమ తరువాతవారు సుఖ పడతారని సంతోషంగా ప్రాణాలు బలిపెట్టినవారు లక్ష లున్నారు. మీరాశించిన స్వర్గసీమ భూమిమీద అవత రించలేదు, సరిగదా కనీసం శాంతైనా లభించలేదు. ఇంతటితో నిరాశలో వాస్తవాన్ని మరచిపోతావేం? నీలాంటి వారు ప్రతి దేశంలో నూటికి 90 మంది వున్నారు. తోటి వారిలో నీభావాలను వ్యాపింపజేసి కట్టుబాటు నెక్కువ జేయడానికి ప్రయత్నించు. అంతేకాని, మాట్లాడితే చచ్చి పోతానెందుకు వెధవ బతుకని పిరికితనం వెళ్ళబోసుకో వాకు. కార్యశూరుడ వనిపించుకో. గాని, పిరికిపందలాగా జారిపోయి నీ తరువాతవారినికూడా దుస్థితిలో పడవేయ వాక! ముందుతరాలవారికి శాంతిసౌఖ్యాలు ప్రసాదించ వలసిన భాధ్యత నీకున్నదని జ్ఞాపకంవుంచుకో!

పె :— ఇన్నిరోజులనుంచీ నన్నుతిట్టినోరే కనుపించారు కాని, ఇయ్యాళ మీరు నన్నుకూడా ఒకమనిసిగా చూసి,

ఈ మాత్రం చల్లని మాటలు సెప్పారు. ఇదే పదివేలు బాబూ!

వెంకయ్య:—ఊరికే అందరిదగ్గర కంఠశోష పడడం మాని వెయ్యి. దేశంలో ప్రతిరోజు వేలకొలది తిండిలేక మాడి చస్తున్నారు. ఎవరికీ ఎవరూ తోడు పడలేరు! కొద్దిమంది పుణ్యాను ... యిన్నివేలమంది చనిపోవలసిందే! ఈ వేలాది నిర్భాగ్యుల ఉసురు ఊరికేపోదు! బీదల ప్రాణాలపెట్టుబడి— వడ్డీతో సహా త్వరలోనే గిట్టుబాటవుతుంది.

పె:—ఇక నేనెళ్ళొస్తా బాబూ!

వెంకయ్య:—నా తమ్ముడు చాలా ప్రయోజకుడే! ఇంత మంది తన నాశ్రయించుకొన్నవారు తిండిలేక చస్తుంటే, ధాన్యం దాచాడూ?

పె:—ఎవరండి?

వెంకయ్య:—నరసయ్య!

పె:— నరసయ్యగారు మీ తమ్ములాండి? అది తెలియక ఏమోఅనేశాను! క్షమించండిబాబూ ... కాదండి ... నాతప్పులేదు. ఎందరో సాటువ అంటన్నారు; నేను ఎదలే అన్నాను - అనాలి ... అన్నాను.

వెంకయ్య:అవును. నీతప్పులేదు. రేపు కనుపించు, నీకు ధాన్యం కొలిపిస్తాను, నరసయ్యతో చెప్పి ... (లక్ష్మీనరసయ్య యింట్లోనుంచి బయటకువచ్చి గడపలుదిగి ఆగుతాడు)

పి:—రేపటిదాకా బతికుంటే—

వెంకయ్య:—ఏమిటి చేయడం! ధాన్యం లేదు, మందులు లేవు! ఆకలితో క్రుంగి, రోగాలతో బాధపడి, నోరులేని జీవాల లాగ వేలాది చనిపోతున్నారు! ఏమిటి చెయ్యడం?... సరే వెళ్ళిరా నాయనా! (పెద్దోడు కన్నీరు పెట్టి వెళ్ళిపోతాడు.)

(లక్ష్మీనరసయ్య మెల్లిగా ఒడుగుకేసి—)

లక్ష్మి:—చావనీ! సగం భూభారం తగ్గుతుంది!

వెంకయ్య:—ఎవరు చస్తే?

లక్ష్మి:—చస్తున్న వాళ్ళే.

వెంకయ్య:—ఊ!

లక్ష్మి:—అయినా ఆ పరమాత్ముడే రక్షించుకుంటాడు. దీన జనోద్ధారకుడు—అన్నింటికీ ఆయనే సమర్థుడు.

వెంకయ్య:—నిజమే కాని, మన అమోఘశక్తితో మనం దేవుణ్ణికూడా సంకెళ్ళు వేసి, మార్కెట్టులో పెట్టి వ్యాపారం చేస్తున్నాం! పేరు ఆయనది, నోరు మనది! దేవుడంటే మూఢవిశ్వాసం గల పేదసాదల దగ్గర డబ్బుతీసుకొని మరీ దేవుణ్ణి చూడనిస్తున్నాం! ప్రసాదాన్ని అమ్మి వ్యాపారం చేస్తున్నాం! పరమాత్ముని కూడా సర్కసులో మృగాన్ని చేశామన్నమాట!

లక్ష్మి:—అంతా వితండవాదన! స్వరాజ్యంలో దేవుడి ప్రసాదం అందరికీ కడుపునిండా ఉచితంగా పెడుదురుగానిలే!

వెంకయ్య:—ఎవరికి స్వరాజ్యం ! నీకు, నీలాంటి లక్ష్మీపుత్రులకు—కాని బీదసాదలకు, తక్కువకులాలవాళ్ళకి కాదుగా! అది యింకా మారానున్నది. దేవుడు వరమిచ్చినా...

లక్ష్మి:—ఇందాక వాడుకూడా, ఆ పెద్దోడు వచ్చినోడు కూడా యిదేమాట ! ప్రతివెధవా నాయింట్లో తిని నన్ను తిట్టేవాడే !

వెంకయ్య:—(చిరునవ్వుతో, నన్ను తిడితే నిన్ను నువ్వు తిట్టుకోడంకాదూ ?—కాని, యిదే మరెవరైనా తిట్టివుంటే మాత్రం చెప్పుతో పండ్లూడకొట్టేవాణ్ణి ... ఇది ఇవ్వాళ రెండవసారి ... (లక్ష్మినరసయ్య పెడమొగంపెట్టి, పెదిమె కొరుకుతూ ఉన్నాడు — పొరబాటుకి చింతిస్తూ—వెంకయ్య గుమ్మరిమిచూస్తున్నాడు)

—తెర—

---

# ఇదీ లోకం!

## 1 వ అంకం – 3 వ రంగం

(రెండవరంగం కాగానే వీధితెరవేసి మూడవరంగం నడపవచ్చు. రంగం – గిరి, తాత లోపలినుంచి పాడుకొంటూ వస్తాడు.)

**తాత:**—కరకుగుండె కఠ రోజులు నిండె
కష్టజీవుల కాలం వచ్చె!
దోపిడి దొంగల సమాధిపైన
లేచెయండి స్వేచ్ఛాగానం! ॥కర॥

చెమట నెత్తురుల ధారవోసిన
శ్రీమంతులనా చిన్నమాపుల్లో
కలిమిపంటల నాహుతిజేసీ
అహర్నిశల ఆనందించే ॥కర॥

అన్యాయాన్ని గని ఆక్రోశించీ
అన్యాయంగా చస్తేపేదను
'పాప' మనని పైశాచిక జాతి—
పాలనిచ్చిన రొమ్మును జీల్చె ॥కర॥

సాగిందోయీ, పవిత్ర హోమం!
స్వార్థపరుల మారణ హోమం!
కష్టజీవుల నెత్తుటి కాల్వలె
కాలభైరవుని నైవేద్యంగా!
నమ్మి, చచ్చిన పేదల ఉసురీ
నరకలోకాన్ని శపించిందీ!
ఇంతకాలంమానెత్తురు తాగిన
ప్రేతజీవులకు శాంతేలేదు. ||౪౮||

(చివర చరణానికి ముందే పెడ్రోను రెండవవైపునుంచి వచ్చినిల్చునివింటువుంటాడు. తాతనుచూచి, పాటవిని, ఆశ్చర్యపడి, నిలబడిపోతాడు. పాటకాగానే ఆనందంతోపొంగిపోతూ)—

పెడ్రో:—తాతా! ఏమిటిది? ఎక్కడిదీపాట? ఏంటీపాట?

తాత:—(వెర్రిగా) పాడుతున్నానా! నేను పాడుతున్నానా? కాదు — కడుపుమంట — అగ్నిపర్వతం బద్దలైంది — పాడుతున్నానో! వాగుతున్నానో! నన్నాపకు! అర్థం కాదు! నాదోవలోనుంచి తప్పుకో —

పెడ్రో:—ఏంటీపాట? వింటే జైల్లో వేస్తారు! చంపేస్తారు!

తాత:—(పిచ్చిగానవ్వి) జైల్లో వేస్తే తిండిదొరుకుతుంది! చంపేస్తే, నరకబాధ తప్పుతుంది! పాడతాను! పాడుతూనే చస్తాను—లేవు! అర్థంలేవు!

శ్రామిక జాతికి ఇదే నరకం!
స్వార్థపరులే శైతానులి!
దాటండోయ్! తరించండోయ్!
ధర్మం మీదే! విజయం తెప్పుడు!
సాగిందోయిూ, పవిత్రహోమం!
స్వార్థపరుల మారణహోమం! ॥౪౭॥

పె:—తాతా! తాతా! యింకా హో! అసలే తిండి లేక యిడై వున్నావ్! ఎందుకు హైరాన పడతావ్! పా!

తాత:—పోతున్నా! కష్టజీవుల కంఠాలన్నీ గర్జిస్తున్నాయ్, వినిపించడం లేదా! బీద, బిక్కి ప్రాణవాయువు వెల్లువికేన సముద్రం లాగా హోరెత్తుతున్నది! వినిపించడం లేదా?

సాగిందో యిూ! పవిత్రహోమం!
స్వార్థపరుల మారణహోమం.
అడ్డుతగిలితే ఆకుల్లాగా
ఆహుతియై పోతారోయ్! ॥౪౮॥

(తాత వెళ్ళిపోతాడు. పెద్దోడు అటు చేపేజూస్తూ, తల పంకించి, రొమ్ము విరుచుకొని నిలుచుంటాడు!)

పెద్దోడు:—సాగిందోయిూ! పవిత్రహోమం!
స్వార్థపరుల మారణహోమం!
(మెల్లిగా అంటుండగా, శాస్త్రుర్లువస్తాడు)

శాస్త్రుర్లు:—ఎవరది ?

పెద్దోడు:—పుల్లడి కొడుకు పెద్దోడ్నండి.

శాస్త్రుర్లు:—రామ! రామ! ఇవాళ ప్రక్కనుంచిలేచి ఎవరి ముఖము చూచివుంటినోకాని, ఎక్కడకువెళ్లినా దమ్మిడీ చేయనివాళ్లే కనబడుతున్నారు. లెత్తాపి, నువ్వు మాల వాడివికూడాకమూ ?

పెద్దోడు:—అనే అంటున్నారండి.

శాస్త్రుర్లు:—నీవైఖరి చూస్తేగా పోల్లాడేటట్లున్నావు. నీగొడవ నాకెందుకు గాని,—అయితే. యుద్ధానికి వెళ్ళొచ్చిన వాడివి గావ్వేనా ?

పెద్దోడు:— వునండి.

శాస్త్రుర్లు:—ఆ! యత్ కించిత్ అనుమానం వాస్తవమే అయింది.

పెద్దోడు:—మీరంటున్నదేంటో తెలియడంలేదండి.

శాస్త్రుర్లు:—ప్రాగ్జన్మ సంస్కారం లేక పోవడమే హేతువు.

పెద్దోడు:—అదసలు తెలియడం లేదండి.

శాస్త్రుర్లు:—నేను చెపుతున్నగాను, తెలియజెప్పడానికి. దారిద్ర్యం లేవు ... ... అన్నట్లు మీయింటిలో ఎవరికో జబ్బుగామా ?

పెద్దోడు:—అందరికీ తిండిలేక రోగాలండి! మా అమ్మ సావుబతుకులలోవుందండి.

శాస్త్రుల్లు :—అవునవును. కొంచెం సుస్తీగావుందిట కాదూ! మీఅయ్యా చెప్పారు ... వండిప్పిస్తున్నారా? కలరా వంటిదేమీ కాదుగద?

పెద్దోడు :—మెతుకేమందండి.

శాస్త్రుల్లు :—అన్నం పరబ్రహ్మ స్వరూపం. ఉదకం నారాయణ స్వరూప మంటారు, అందుకే.

పెద్దోడు :—అంటే యేంటండి?

శాస్త్రుల్లు :—మాలవాడివి, నీకీవిషయాలు ఎందుకులే ... ... ఆస్పత్రికి పంపకపోయారూ?

పెద్దోడు :—పదూళ్ళకు ఒక్క ఆసుపత్రయినా లేదండి. కట్టమో, సుకమో ఎళ్ళమూ అక్కడకూజు మమ్మల్ని సిన్నసూపే సూత్తారు. ఇంక వూళ్లో వైద్దులంతా పెద్ద కులాలోరు! రోగిచాయులకేరారు! మా బతుకంత అవిటిబతుకో సూనారా? ... ... ఎన్నోదేశాలు సూశి నాను. ఎక్కడయినా వైద్దులు రోగిదగ్గరకొచ్చి ఎంతో యిదిగా, పేదోళ్ళయితే ఉత్తినేకూడా సాయంసేస్తుం డారు. ఇక్కడే మ బతుకే యిట్టాతగలడతన్నది.

శాస్త్రుల్లు:—కవిత్వంమాట్లాడేస్తున్నావ్! ... ! అసలు నీబోటి వాళ్ళు అక్కడా యిక్కడా ఏవో చూచి రావడం వల్ల నే దేశానికి యింతముప్పొచ్చింది! రక్షించనిచోకవి

గాంచునేకదా అని, మేము! కన్నం చూడలేనివిషయాలు నీవు చూచినట్లు మాట్లాడతావేం? అవివేకీ

పె:—ఆమాటేంటో తెలియడంలేదు గానితిడుతున్నట్టుండారు!

శాస్త్రుర్లు:—కాదు కాదు. భూషిస్తున్నాను... నిన్ను జూస్తే నాకు నవ్వొస్తుంది నిన్న మొన్నటివాకా చీకడ్డపెట్టుకొని గొడ్లు తోలుతున్నవాడివి, ఏదో పటాటంలోకవాలు లాగివచ్చిన మాత్రాన, పెద్దమాటలు మాట్లాడుతున్నావ్! చిత్రం! దొంగవెధవలు! పొద్దు గుంకిన దగ్గిరనుంచీ దొంగతనాలేగా?

పె:—మేం దొంగలమాండి? కాదండి మీలాటి మనుష్యుల్ని దొంగల్నిసేస్తారు. కడుపుకట్టుకు ఎంతైనా సేయి స్తంభదొరా! కడుపునిండా తిండి, వొంటినిండా గుడ్డవుంటే దొంగతనాలు సేయడం మాకేం గహాచారం!

శాస్త్రుర్లు:—వద్దు ఒకడొక్క కాలుతుంటేనే పనిచేస్తుంది గాని, కడుపునిండితే వడుంవాలుస్తుంది... సరేగాని, అసలు విషయం మరచిపోయాను. నీ చెల్లెలిపేరు నాగికామా?

పె:—అవునండి.

శాస్త్రుర్లు:—లక్ష్మీనరసయ్యగారి నెరుగుదువా? ఆ మిల్లుల యజమాని. నా కష్టాలన్నివిని ఆయన మనసు పూరిగుండె కరిగిపోయింది. నువ్వు అనిటివాడివి. యింట్లో మీఅయ్యతప్ప

సంపాదించే దిక్కు లేదని, నాకిక పని యిస్తానంటున్నాడు. ఆలోచించుకో ?

పె:—దానికి పెండ్లీడండి. అదైతే యింక మొగుడ్నిస్తం.

శాస్త్రులు:—ప్రస్తుతం మాట ఆలోచించుకో! ఆమిల్లులో ఉద్యోగానికి మనుష్యులు తక్కువకాదుగదా! ఏదో మీమీద వుండే అభిమానం కొద్దీ ఆయన అలాఅంటున్నాడు బాగా ఆలోచించు. యిక కూలిమాటంటావా ? నాగిఒళ్ళు దాచుకోకుండా — ఆ — ఒళ్ళు దాచుకోకుండా పనిచేస్తేగాని, ఆయన రోజుకు అయిదు రూపాయలైనా యిస్తాడు. ఊరికే మీకు వచ్చిస్తే మిగతా కూలీలకు కన్నుకుట్టుతుందని యిలా చెబుతున్నాడు, అంతే. ఒళ్ళుదాచుకోకపోతే నాగి మీ కంటికి ఎక్కువగా సంపాయించగలదు.

పె:—దాన్ని కనుక్కొని సెప్తానండి.

శాస్త్రులు:—ఇప్పుడిక్కడ లేదూ ?

పె:—లేదండి, మేనమామల యింటికాడుంది. ఆ పాంచాల కాటకం జరీయిదిగా వుందంటంది. కలరా, అమ్మోరు యిపరీతంగా వున్నాయంట. యియ్యాల తెల్లి తీసకరాబోతన్నా. రాత్రికి తిరిగొస్తా. రేపు సెబతా.

శాస్త్రులు:—పాపం. మీ అమ్మకు అట్లావుందంటివి ? వెళ్లకపోతేయేం ?

పె:—నాగిని సూడాలని పోరెడతున్నదండి.

(లోపలనుంచి—

సాగించవోయీ పవిత్రహోమం!
స్వార్థపరుల సామ్రాజ్యహోమం!
ఇంతకాలం మానెత్తురు త్రాగిన
ప్రేతజీవులిక తాగలేరు.
నగరు కుండేను రోజులునిండే
శ్రమజీవులందరి కాలంవచ్చే!
దోపిడి దొంగల సమాధిపైన
లేపి కట్టండి స్వేచ్ఛా నగరం!

పాట సావేశంగా ఉంది. ఇంతలో "కొట్టండి" 'తన్నండి' అని కేకలు 'ఆ' అనే రోదన వినిపిస్తుంది.)

పె:—వత్తా బాబూ! వత్తా! తామువస్తి కొడతన్నారు. ముసలాడి మీన వత్తాడు అంతా సామునేస్తుండారు.

(పోతుంటాడు)

శాస్త్రుల్లు:—ఏం జేశాడ్రా? ఏదో చేసి వుంటాడు. లేకపోతే పగటిపూట బజార్లో ఎందుకు కొడతారు?... పెద్దోడా! ఆ విషయం మంచిపోబోక.

(తాను రెండవవైపుకు వెళ్ళిపోతాడు.)

—( తెర )—

# ఇదీ లోకం!

2 వ అంకం

(తెర లేచేసరికి ఒక గుడిసె కానవస్తుంది. చూరు భూమికి గజం ఎత్తు. అందులో నుక్కి మంచం మీద లచ్చి పడుకొని వున్నది. మెడ దాకా గుడ్డ కప్పబడి ఉంటుంది. గుడిసెకు బయట కొంచెం దూరంగా బుడ్డోడు పడుకొని వున్నాడు. అసహనంతో బాధపడుతున్నాడు. మరికొంత దూరాన తాత పడివున్నాడు. నెత్తికి కట్టు. కట్టు మీద, ఒంటి గుడ్డ మీద రక్తం మరకలు. పుల్లడు లచ్చి మంచం దగ్గర నేలమీద కూర్చున్నాడు. తెర ఎత్తేసరికి రంగం మీద గుడ్డి వెల్తురుగా మాత్రమే ఉంటుంది. ఈ సీనులో బుడ్డోడు వచ్చేవరకు గుడ్డి వెల్తురుగానే వుండాలి. వీలైతే Spot Light తో, లేదా [illegible] మంచి టార్చిలైటుతో గుడిసెలో వారిని చూపాలి. పుల్లడే ఈ సీనులో అటూ ఇటూ తిరుగుతాడు. Light అతనిననుసరిస్తుండాలి)

పుల్లడు:—(మమతతో లచ్చినోటిలో నీరు పోస్తూ) ఇంకా సిని—

లచ్చి:—(నిస్సత్తువగా) ఇంగ లేను… …

పుల్లడు:—ఏం? మింగుడు పడడమాలా?

లచ్చి:—బయటెందుకు మామా? ...... యిట్లాగూకో...

(మంచంమీద కూర్చుంటాడు. లచ్చి లేవబోతుంది.)

పుల్లడు:—పడుకో! లేవొద్దు! కళ్ళు తిరగతయ్!

లచ్చి:—ఇయ్యాల కుశాలుగావుండాది. (లేవబోతుంది. పుల్లడు లేవదీస్తాడు. పుల్లడిని పట్టుకొని అతడిరొమ్ముమీద తలెట్టుకొని జారగిలబడుతోంది లచ్చి) ఏదన్నా-పురాండంలో... కతొస్తె...

పుల్లడు:—నీ నా బతుకే ఒకపురాండం... ఇంకేంకతలు...

లచ్చి:—యెన్నెల... బాగుండాది...

పుల్లడు:—మనకి సిసెలో సీకటే!

లచ్చి:—మామా!... నేను పచ్చేరోజొచ్చింది... నాగికి ఏడవ నెనా మానెళ్ళి చూసి బుట్టేవ్?

పుల్లడు:—ఆ!

లచ్చి:—పిల్లోడొచ్చాడా?

పుల్లడు:—వత్తాడు నాగిని తీసుకొత్తాడు...

లచ్చి:—సరిగా వుండాది...

పుల్లడు:—వొళ్ళంతా మునిపోతంది, సరేందే?

లచ్చి:—వొళ్ళంతా... నొప్పులు... ఇగ్గొట్టుతోంది.

పుల్లడు:—(వెల్లి వొళ్ళు పడతాడు)

చుట్టూ చూస్తాడు....) ఓ...(విపరీతంగా దగ్గి దగ్గి లచ్చి నిశ్చలంగా [illegible] తుంది. చేయి మెల్లిగా మంచంమీది నుంచి జారి [illegible] తాకుతుంది... బుడ్డోడు లేస్తాడు... తల్లి దగ్గిరకు పోవాలని ఆత్రుద్దా... పోవటానికి శక్తిలేదు... మెల్లిగా దేకుతూ, ఎటూ తాత దగ్గిర కెళ్ళి. తాతను కుదుపుతూ, తల్లివైపు చూపుతాడు... తాత కదలడు. లాభంలేదను కొని దేకుతూ, దేకుతూ తల్లి మంచం దగ్గిరకు చేరుకుంటాడు. మంచం పట్టుకు లేస్తాడు... చూస్తాడు — వెర్రిగా తల్లిని కదలిస్తాడు... పొంగిపొర్లుతున్న దుఃఖంతో కదిలించి, కదిలించి, నిస్సత్తువవల్ల, నేలమీద పడిపోతాడు. ఇక్కడ బుడ్డోడు 'ఆ' అంటే రసభంగం ప్రమాదం కలదు గాన మూకాభినయం ఉత్తమం.)

పుల్లడు:—(పరుగెత్తుకుంటూ వచ్చాడు. చేతిలో నీరు కారుతున్న గుడ్డముక్క. లచ్చి మంచందగ్గిర కొచ్చి, దాని నోట్లో ఆ గుడ్డను పిండుతూ) ఇంగ, లచ్చీ, ఇంగ— శోసొచ్చి పడ్డది... లచ్చీ... లచ్చీ... (మెల్లిగా నెత్తిన కదుపుతాడు)... వొళ్ళంత సల్లంగ... (తనచేయి చూచుకొని, తడిసిపోయిన్న దాని గుడ్డకు తుడుచుకొని, మళ్ళా లచ్చివొళ్ళు చూచి, ఖంగారుగా, పిచ్చివాడిలాగా దాని ముక్కుదగ్గిర, గుండెమీద చేయివేసి చూస్తాడు... కూలి పడిపోతాడు... నిశ్శబ్దంగా ఒక్క నిమిషం... మెల్లిగా లేచాడు... ఒక్కసారి

లచ్చివంక, బుడ్డోడివంక చూశాడు.... రొమ్ము విరిచాడు
శూన్యానికున్నను నూటిగా నిగుడించి, మెల్లిగా బయలు
దేరి నాలుగడుగులు వేశాడు... పెద్దోడు మెల్లిగా కర్రలతో
నడుస్తూ వచ్చి, నిలుచున్నాడు. పుల్లడు ఆగాడు... పెద్దోడు
తలొంచాడు... ఇద్దరు మాటలాడకుండా ఒక్క నిమిషం
వున్నారు.)

పె:— అయ్యా!... ... ...

(పుల్లడు అదే చూపు. చలనం లేదు.)

పెద్దోడు:— అయ్యా! నాగి... ...నాగి... అవ్వాళ్లో... ...
అమ్మొరొచ్చి... అయ్యా!

(పుల్లడు అదే చూపు, చలనం లేదు.)

పె:— నాగి చచ్చిపోయిందయ్యా! ... ...(కూలబడిపోతూ)
ఈమాట సెప్పాలని లేనిపోని సికతో వొచ్చాను... ...
అమ్మకు సెప్పవాకయ్యా! ... ... గాభరాపడతంది...
కళ్లు తిరుగుతున్నయ్ ... ... ... మంచినీళ్ళున్నాయేవూ?
(పుల్లడు వెళ్ళిపోతున్నాడు ...) అయ్యా! ... ...(పుల్లడు
ఆగడు.)

పుల్లడు:— ... ... అమ్మ! ... ... అదుగో... ...మంచం
కిందనూడు ... ... కలరా ఎత్తకపోయింది... ...బుడ్డోడు
కూడా వెంటపోతాడు నేనుకూడా పోతన్నా! నువ్వు
కూడా పోతావ్! ఎవరికారే! ... ... ఇంక, ఎవరికారే!

... ... ఇంక, ఎవరి గారే! ... ... ... (వెళ్ళిపోయాడు)

పె:—అమ్మా! అమ్మా! (లేవ గోయి పడతాడు)

(ఇంతలో బుడ్డోడు అమాంతం లేచాడు. ... ... పైకి చూస్తున్నాడు! ... ... తాతకూడా లేచాడు ... ... యిద్దరు గాలిని వాసనచూస్తున్నారు. బుడ్డోడు చేత్తో పైకిచూపుతాడు.)

తాత:—కాకమ్మతల్లి! ఆవిమాక సుక్క పారెయ్యమ్మా! దాన్నిపుచ్చుకొం దెంమాంసం పర్మారు చెయ్యమ్మా ... ... ఇశ్ ... ... ... ఇశ్ ... ... ... (చేత్తోతోలుతాడు. ఎముక సుక్క కింద పడతుంది అటునుంచి తాత, యిటు నుంచి బుడ్డోడు ఒక్కసారేదాని వైపుకు పారాడుతారు. తాతదానిని తీసుకొని, రంగంలోంచి వెళ్ళిపోతాడు. బుడ్డోడు అటు కేసే సూసి, సూసి కిందకి పోతాడు. .... యింతలో ఒక స్త్రీవచ్చింది పేరుజీవచ్ఛవం. మనిషి ఏమంత ఆరోగ్యంగా లేదు. వయస్సుషుమారు 20. సాదా చీర చిరిగింది కట్టింది... జుట్టువిరియబోసుకొన్నది.....మెల్లిగా నడుస్తూ వచ్చింది. అంతా కలియజూచింది.)

జీవచ్ఛవం:— ఒకటి, రెండు, మూడు (పిచ్చిని, బుడ్డోణ్ణి, పెద్దోణ్ణి లెక్కలెట్టింది.... ... పెద్దోడు మెల్లిగా కదిలాడు) మూడు... ... రెండే... ... (పెద్దోడు స్త్రీని చూచాడు. లేచాడు.... ...)

పె:—ఎవరు ?

జీవచ్ఛవం:— కనిపించటంలేదూ? ఆడదాన్ని! నీదగ్గర డబ్బున్నా లేకపోయినా నాకొకటే......కడుపునిండా తినడానికి ఏమైనాపెడితే......నిన్ను ఒకక్షణంసేపు సుఖపెడతాను!

పె:—ఎవరికావాలే!......నాకే......తిండానికిలేదు......

జీవచ్ఛవం:—ఇవాళ లేదనకపోతే మంచిదికాదు. ఊఁ! వెన్నెల బాగుంది.చల్లనిగాలి......ప్రేమఅనుకుంటూ వెర్రికలలు గనే కాముకులు పట్టణంలో దొరుకుతారు. యిదేసమయం వెళ్ళొస్తా.

పె:—నేను కూడరానా? నాకూకూడా కొంచెం తినడానికి యిప్పిద్దూ!

జీవచ్ఛవం:—(నవ్వుతూ) దయతలచమంటావా! ...(నవ్వి) నేను గౌరవంగల కుటుంబంలోనే పుట్టాను, కాని, అంతా చితికిపోయి ఆకలికి తట్టుకోలేక మర్యాదగా అడిగితే మొగాళ్ళంతా మీసాలు తిప్పేరేగాని, ఒక్కమెతుకుపెట్ట లేదు! "ఎంత?" అని ప్రశ్నించారేగాని, "ఆకలవుతున్నదా?" అని ఒక్కడుకూడ అడగలేదు! పేగులు మాడిపోయి, కళ్ళుతిరుగుతూ నేను పడిపోతున్నప్పటికీ, ముందు తమఅక్కరతీర్చుకొని, ఆతర్వాతనే నాకుతినడానికి యిచ్చేవారు! బలవంతులైతే చెరిచేవారు! ...దయ,

దాక్షిణ్యం వుంటే బతక లేవు బాబూ! ... న్యాయానికి కూడెక్కడ? శీలానికి విలువెక్కడ? ఇదిలోకంకాదు, నరకం. నరకంమీద వ్యాఖ్యానమే నా బ్రతుకు... ఈ నరకంలో ఎవరికివారే! (వెళ్ళిపోతుంది. పెద్దోడు ఆమె పోయిన దిక్కుకేచూసి, కట్టూరాళ్ళిపోయాడు... జీవచ్ఛవం తిరిగొస్తుంది. కొంగున కట్టివున్న ఒకరొట్టెముక్క తీసి పెద్దోడిమీదపడేసి) తిను! నిన్నుచూస్తే నాలోచచ్చి పోయిన కరుణ ఎందుకో గలౌత్తింది. ఇది యివ్వకపోతే ఆ కరుణ నాలో పెరిగిపోతుంది. అంటే నాకు పిండందొరకదన్న మాట. ఇది తీసుకో. నాలో కరుణ మళ్లీ చచ్చిపోతుంది, తృప్తిపడి.

పె:—మరి నీకో! చెల్లీ!

జీవచ్ఛవం:—ఆమాటే చాలు!... ...అన్నయ్యా!... ...

(వెళ్లిపోతుంది. పెద్దోడు రెండుచేతులెత్తి ఆమెకు నమస్కరిస్తుంటాడు. యింతలో తెరలోనుంచి తాతకంఠస్వరం—

కరకుగుండెలకు రోజులునిండె!
కష్టజీవులది కాలంవచ్చె!
దోపిడిదొంగల సమాధిపైన
లేపేయండి స్వేచ్ఛానగరం!
(పెద్దోడుకూడా కలిసి పాడతాడు—
తరువాత తాత ఆవేశంతో పాడుతూ ప్రవేశిస్తాడు.)

శవాలకుప్పలపైన నాట్యం
చేసే స్వార్థపరుడా! నిల్చో!
రక్తం త్రాగి బలిశావేమో,
రక్తం మొత్తం కక్కిస్తాం! ॥శ॥

ఇదిగో నిన్ను వదల్చుకుంటాం
పదరా పేదల కాళ్ళ వెబడు—
నిక్కినీల్గితే నిక్కముగా నిను
ముక్కలుగా చీల్చేస్తాం!

రూపుమాపి నీజాతినంతా
దీనలోకమును రక్షిస్తాం! ॥శ॥

(పెద్దోడు తాతను చూచినకొద్దీ ఉత్సాహం పొందు తాడు. లేచి కూర్చుంటాడు. తరువాత లేని ఓపికతో నిలు చుంటాడు. తాతపోతుండగా—తెర)

— తెర —

---

# ఇదీ లోకం!

3 వ అంకం

(వీధిలో లక్ష్మీనరసయ్య)

లక్ష్మి:—వాసన జూడనట్టి ప్రసవంబు, నఖంబుల
ద్రుంపనట్టి నూ
త్నానమపల్లవంబు, పరులానని
క్రొవ్విరితేనె, సూదివి
న్యాసములేనిరత్నము, మహాశత
పుణ్యఫలంబువోలు ఆ
భాసురగాత్రి సోయగ మపారముగా
భుజియింత్రు మీరికన్!

(పద్యంఖులాసాగా పాడుతుంటాడు. రెండవవైపునుంచి
జీవచ్ఛవంచరచరానడచి పోతుంది. నరసయ్య ఆమె వంకే
చూస్తుంటాడు. జీవచ్ఛవం తిరిగొచ్చి రెండోవైపుకు
వెళుతుంది. నరసయ్యఆమెనేచూస్తుంటాడు. జీవచ్ఛవం మళ్ళీ
వచ్చి నరసయ్యకు కొంచెం దూరంలో నిలబడుతుంది.)

జీవచ్ఛవం:—ఎందుకట్లా గ్రుడ్లు తాటికాయలంత చేసుకు
చూస్తావ్?

లక్ష్మి:—అబ్బె ...... బ్బె ...... ఏ ...... ఏమీ లేదు... ఏముంది ?

జీవచ్ఛవం:—ఘనుడివే !

లక్ష్మి:—ఏమీ ...... ఏమీ ...... లేదంటూంటే ... !

జీవచ్ఛవం:—ఇంకెపుడూ ఉల్లా ఊరికే చూడవాక !

లక్ష్మి:—ఇంకెందుకు చూస్తాను ?

జీవచ్ఛవం:—ఊరికే చూడవా !

లక్ష్మి:—ఆ !

జీవచ్ఛవం:—(వెక్కిరిస్తూ) ఆ !

లక్ష్మి:—(దీర్ఘంతీస్తూ) ఆ !

జీవచ్ఛవం:—(దీర్ఘంతీస్తూ) ఆ !

లక్ష్మి:—ఇక వెళ్ళండి !

జీవచ్ఛవం:—తమరు చెప్పనక్కరలేదు.

లక్ష్మి:—(కూనిరాగం తీస్తాడు)

జీవచ్ఛవం:—(చూస్తూ వుంటుంది.)

లక్ష్మి:—(ధైర్యంచేసి కన్నుగొడతాడు)

జీవచ్ఛవం:—ఆ ! కన్నుగొడుతున్నావ్ ? ఊ... తరువాత ?

లక్ష్మి:—ఏం ...... ఏం ...... లేదు ... కంట్లో ... నలక ...... నలకపడింది.

జీవచ్ఛవం:—గొప్పవాడివే !

లక్ష్మి:—మీ... మీపేరు ?

జీవచ్ఛవం:—ఎందుకు ?

లక్ష్మి:—ఊరికేనే ! తెలుసుకుందామని !

జీవచ్ఛవం:—ప్రయోజనం ?

లక్ష్మి:—ఏమీ లేదు.

జీవచ్ఛవం:—ఊఁ !

లక్ష్మి:—ఏమిటి మీ పేరు ?

జీవచ్ఛవం:—జీవచ్ఛవం !

లక్ష్మి:—నాతో వేళాకోళమా ?

జీవచ్ఛవం:—వేళాకోళమేమిటి ?

లక్ష్మి:— లేకపోతే మీవంటి సౌందర్యవతికి, రూపవతికి, యవ్వనవతికి అటువంటి పేరుంటుందా ? ఉండదు, ఉండదు.

జీవచ్ఛవం:—ఎటువంటి పేరుంటుంది ?

లక్ష్మి:—సరోజ అనో, పద్మగంధిఅనో, వరూధినిఅనో... ...

జీవచ్ఛవం:—కాదు. నా పేరు జీవచ్ఛవం !

లక్ష్మి:—మీ తల్లిదండ్రుల తెలివికి ఏడవాల్సిందే !

జీవచ్ఛవం:—మీ బోటివారి తెలివికి ఏడ్చి, ఏడ్చి యీ పేరు నేనే పెట్టుకున్నాను !

లక్ష్మి:—మీరు చాలా బాగావుంటారు.

జీవచ్ఛవం:—ప్రేమిస్తున్నావా ?

లక్ష్మి:—అదే... ...అదే... ... ...

జీవచ్ఛవం:—ప్రేమగీమ నాకు తెలియదు. నాకు ధనం అక్కర్లేదు. డబ్బువున్నా, తిండి దొరకదు. డబ్బుతినంగదా! నాకు కావలసిందల్లా కడుపునిండా భోజనం... ...

లక్ష్మి:—పదిసార్లు, కాదు లక్షసార్లు కడుపునిండా తిను. మనదగ్గిర అటువంటి దుర్మార్గంలేదు... ఆ!... ఏదీ! యిట్లా దగ్గరకిరా?

జీవచ్ఛవం:—ఎందుకు?

లక్ష్మి:—అబ్బ! రమ్మంటూంటే!... ఏదీ!... నేను బాగా వున్నానా?

జీవచ్ఛవం:—నీవు బాగున్నావని మనస్ఫూర్తిగా అనుకునేది నీభార్య! నీవు బాగావున్నావని పొగిడేది వేశ్య. నేను నీభార్యనూకాను, వేశ్యనూకాను. నీబాగోగులతో నాకు సంబంధంలేదు.

లక్ష్మి:—వేశ్యవు కాకపోవటమేమిటి?

జీవచ్ఛవం:—వేశ్యాకులంవున్నది. నేను దానికి చెందను. నేను తిండిలేక శీలం అమ్ముకుంటున్నాను. వేశ్యకంటె ఒక అడుగు తక్కువన్నమాట! నాస్థితి ఘోరమేగాని సత్యం, అయితే తప్పు నాదికాదు.

లక్ష్మి:—మరి?

జీవచ్ఛవం:—మీలాంటి ధనవంతులదే!

లక్ష్మి:—వ్యవహారం చాలాదాకా వుందే?

జీవచ్ఛవం:—మహాభారత మంతవుంది! ఇదంతానీకెందుకు? నీ గొడవ నాకెందుకు? నీపేరేమిటనైనా నేనడిగానా? అది నాకనవసరం! అన్నిభేదాలకు అతీతమైన ఆకలిబాధ పడలేక, అన్నిభేదాలకు నేను అతీతమైనాను! నన్నుకన్న తల్లిపేరు క్షామం! నా తండ్రిపేరు స్వార్థం. ఇంతవెధవ బ్రతుకు బ్రతికేకన్నా ఏనుయ్యో, గొయ్యో చూచుకో లేవా అని ప్రశ్నిస్తావా? అంతధైర్యంలేదు. చూస్తూ, చూస్తూ చావలేకపోయాను. నాలాంటివాళ్లు వేలకొలది ఉన్నారు! ...... ఇప్పుడు ఇదంతా ఎందుకులే! నా కడుపు కాలిపోతూ... కక్కుర్తినాది! ...... నీ అక్కర నువ్వుతీర్చుకో! ... ఆడది ఇట్లా మాట్లాడుతుందేమి అంటావా? తియ్యగా మాట్లాడేది భార్యగాని, మానాభిమానాలు చంపుకొన్న నాకు మర్యాదలేదు, మెత్తదనం అంతకంటేలేదు.

లక్ష్మి:—నీమాటలు వింటూంటే భయమేస్తున్నది?

జీవచ్ఛవం:—నన్నుసృష్టించింది మీబోటివారే! మీరే భయపడతారా? ...... ఇంతకీ భోజనమేకీ?

లక్ష్మి:—నాకు నీమాటలు వింటుంటే పిచ్చెత్తుతున్నది!

జీవ:చ్ఛవం—నీఅవస్థ జూస్తుంటే నాకు నవ్వొస్తున్నది!

లక్ష్మి:—నిన్నుచూడలేను, నీతో మాటాడలేను, వెళ్లిపో!

జీవచ్ఛవం:—చూశావామరి! నాఅవస్థఅంతా చెప్పుకున్నాను గాని, నేనంటేనీకు అసహ్యంవేసింది... జాలికలిగిందా?

ఎందుకు కలుగుతుంది? జాలి అనే పదార్థం ప్రపంచంలో వుంటే నా బ్రతుకిట్లా ఎందుకు బాధలవుతుంది? నేను నీతో సరసంగా మాట్లాడలేవని యింతభయపడ్డావ్! నేను నీ భార్యనుకాదు, సంసారాడ్డానికి! నాశరీరంమీద నీకు క్షణికంగా అధికారంవస్తుంది! అంతే. నాఊసురుమాత్రం మీస్వార్థజాతిని దావానలమై కాల్చుకుతింటుంది.

లక్ష్మి:— వెళ్లిపో! పిశాచీ! (కేకవేస్తాడు)

జీవచ్ఛవం:—(బిగ్గరగానవ్వుతుంటుంది వెంకయ్యావస్తాడు)

వెంకయ్య:—ఏమిటిది? ఎవరిది, తమ్ముడూ?

లక్ష్మి:—ఎవరో పిచ్చిది!

జీవచ్ఛవం:—(బిగ్గిరిగానవ్వుతూ) నేనా పిచ్చిదాన్ని! అయ్యో! పిచ్చితండ్రీ! నాస్థితిలో నీ వుంటే నీకు xox వెర్రులెత్తేది! తినడానికిలేక రెండేళ్లపసికందును రెండురూపాయలకమ్ముకుంటే, నీకు నాస్థితి తెలుస్తుంది! నాలుగేండ్ల పసిపిల్లను తల్లి తండ్రులు తమకడుపు కక్కుర్తికొద్దీ వ్యభిచార గృహానికి అమ్మివేయడం, నాలుగు రూపాయల కాశించి అమ్మివేయడం, అందులోబాధ, నీకేం తెలుస్తుంది? ఆకలి మంటలు దావానలంలాగా నిలువంతా దహించేస్తుంటే భర్తలు భార్యల నమ్మారు! తల్లి తండ్రులు పిల్లల నమ్మారు! అన్నలు చెల్లెళ్ల నమ్మారు! మోటారుకార్లలో తిరుగుతూ, విలాస వినోదాలకు డబ్బువెచ్చించి, క్షామం

లేవని చెబుతూ, ధాన్యం నిలవజేసుకొని, ధనరాసులు కూడ పోసుకొనే వాడికి యీ బాధలేం తెలుస్తయ్ ? సత్యసంధుననిపించుకోడానికి చంద్రమతిని హరిశ్చంద్రుడమ్మివేశాడు ! కడుపుకక్కూర్తి కొద్దీ నా భర్త నన్ను నిండుబజారులో నిలువబెట్టి పశువులాగా అమ్మివేశాడు ! ఎవరికివారే ! నాలాగా ఎందరో అమ్ముడుబోయారు ! రూపంకొద్దీ విలువ ! యవ్వనంకొద్దీ ధర! మర్యాదకు, గౌరవానికి, శీలానికి దమ్మిడీవిలువలేదు, ఈ నరకలోకంలో ! స్వర్గం అనుభవమైందినాకు! నాకాపిచ్చి ? నాదా తప్పు ? నాకు పిచ్చా ? నాకా ?

(బిగ్గిరిగా నవ్వుతూ వెళ్ళిపోతుంది.)

వెంకయ్య:— మాతమ్మా ! ఇదిగో ! ఒకక్షణం......

(ఆమెవెళ్ళినదిశకేపోతాడు. రెండవవైపునుంచి శాస్త్రులు వస్తాడు.
జీవచ్ఛవం, వెంకయ్య వెళ్ళినదిశకే నరసయ్య చూస్తుంటాడు.)

శాస్త్రులు:— నరసయ్యపంతులుగారికి నమస్కారం.

లక్ష్మి:— ఆ !... ఓహో ! శాస్త్రులుగారా ? ఇప్పుడిక్కడికిఒక ఆడది వచ్చింది... కడుపుకక్కూర్తికొద్దీ పడుపువృత్తిలో దిగిందట. తన కథంతా చెప్పింది... చాలా తమాషాగా వున్నది. ఒక కావ్యానికి మంచివస్తువు. మీరు ఉపయోగించుకోండి.

శాస్త్రుల్లు:—నీచవస్తువు! తత్రాపివ్యభిచారిణి! మనవంటివారి ఛాయలకైనా రాకూడదు!

లక్ష్మి:—ఒక ఉపన్యాసం దంచేశింది!

శాస్త్రుల్లు:—మీరేదన్నా మెచ్చుకొని ధర్మం యిస్తారేమో నని!

లక్ష్మి:—మీరేకోపని మీ దొచ్చారు?

శాస్త్రుల్లు:—అదేనండి, బియ్యంగావాలని మనవి చేసుకున్నాను. రాత్రికి రమ్మని మీరు ప్రొద్దున సెలవిచ్చారు...... అందు కని......

లక్ష్మి:—ఎందుకు? నాజాతకంలో మహార్దశ నడుస్తున్నదని చెప్పినందుకేనా? గొప్పజ్యోతిష్కుడవే! గొప్పమహార్దశ నడుస్తున్నది! చాల్చాల్లే! ఇకదయచెయ్యి!

శా:—తమరలా శలవిస్తే...

లక్ష్మి:—మీరుశలవిచ్చినదంతా సర్వాబద్ధమైంది. మహార్దశ మాట దేముడెరుగును గాని, గొంతులోతు రొంపిలో దిగపడ్డాను! వెళ్ళిపోబాబూ! నీకోనమస్కారం!

శాస్త్రుల్లు:—నావాక్కు ఉత్తినేపోదండి. ఫలితం తమకు అను కూలం! తత్రాపి విశేషకీర్తిదాయకం కూడా!

లక్ష్మి:—ఎవరావచ్చేది? పుల్లడేనా?

శాస్త్రుల్లు:—అవునండి. ఆవిషయం యత్కించిత్ కదలించి చూస్తారేమో!... నేను నాలుగడుగులుదూరంగావుంటాను.

లక్ష్మి:—మంచిది.

(శాస్త్రుల్లు వెళ్ళిపోయాడు. రెండవవైపునుంచి పుల్లడు వస్తాడు – గతరంగంలో వలెనే శూన్యదృక్కులు.)

లక్ష్మి:—ఏం పుల్లడూ ! ఏమిటివిశేషాలు ?

(పుల్లడు ఆగాడు. అలాగే చూస్తున్నాడు.)

లక్ష్మి:—ఏం ? అలావున్నావ్ ? అవును పాపం ! మూడురోజుల నుంచి అన్నం లేదుగా ! సాయంత్రంవచ్చి నూకలు తీసుకు పొమ్మంటినిగా ! రాలేదేం ? మీరెప్పుడూ యింతేరా ! ఇస్తాము రమ్మన్నప్పుడు రావడానికి వొళ్లుబరువు! తరువాతేమో మమ్మల్ని దుమ్మెత్తిపోస్తారు! ... ... ... ... ... సరే! ఇప్పుడైనా వచ్చావ్ సగంనయం ! లచ్చికెలావుంది? పాపం... మాట్లాడవేంరా?... వమిటా చూపులు ? నిన్నే? నాగివొచ్చిందా ?...హాయిగా బ్రతికే యోగ్యత నీకున్నదిరా ! చేతులారా చెడగొట్టుకుంటున్నావ్ !

పుల్లడు:—(మెల్లిగా నవ్వుతాడు)

లక్ష్మి:—నవ్వుతావెందుకు ? నేను నిజం చెపుతున్నాను. కలికాలంలో అందరికీ తిండికి యిబ్బందిగానేవుంది. మే మేదో హాయిగా కాలుమీద కాలేసుకొని బంగారం తింటున్నామని మీరనుకొంటారుగాని, చెట్టునుబట్టి గాలిలాగా, మాకూ సంసార లంపటం హెచ్చేరా! అట్లా దర్జాగా బ్రతికే అవకాశంవుంటే, హాయిగా ఒకచోట కూర్చుని

'కృష్ణా, రామా' అనుకోమూ? ఇంకా ఇరవైనాలుగు గంటలూ కష్టపడి పనిచేస్తామా? ...సరే... ఇంతకూ చెప్పవచ్చేదేమంటే, ఈరోజులలో పెద్దకులాల్లోనే నీతి, ధర్మం లేవు. అటువంటప్పుడు మీలో వుండవనినాకు తెలుసు. ఇందులో ఆశ్చర్యం లేదు... ...ఇంతకుముందే యిక్కడి కొక ఆడదివచ్చి వెళ్లింది...కడుపుకక్కుర్తికోసం పాపం! పశువృత్తిలో దిగింది... ... ... ... ... ...అది దాని దౌర్భాగ్యమనకో! అదే నాగి అయితే, అటువంటి దురవస్థ నేను బతికుండగారాదు. హాయిగా మీకందరికీ రాజభోగం సమకూర్చనూ! (పుల్లడికి కోపంవచ్చింది. మనిషి రొజుతున్నాడు...) మనం తల్చుకొంటే కొండ మీదికోతిఅయినా దిగొస్తుంది! నీకు తెలియనిదేముం దిలే! ఏమంటావ్?

పుల్లడు:—ఎంత మాలోళ్ళమైనా, ఎంత తింటానికి లేకపోయి నా, మాకునీతుంది! కుక్కలకు కూడా నీతుంటుంది!

లక్ష్మి:—ఇదంతా మెట్టవేదాంతం! కళ్ళుతెరిచి స్థితిగతులు పారజూడు. న్యాయానికి కూడు లేదురా!...

పుల్లడు:—నా పీక తెగ్గోసినా...

లక్ష్మి:—అదెంత సేపులే!

పుల్లడు:—ఈ అవిటి బతుక్కంటే అదేనయం,

లక్ష్మి:—చూడు, ...'ఊ' అను...నిన్ను రెండు నిమిషా

లలో మహారాజును చేస్తాను... ఇంకా నీకు నమ్మకం లేకపోతే, యిప్పుడు ఈ క్షణమే... నా మెడలోని ఈ బంగారం గొలుసు యిచ్చేస్తా!

పుల్లడు:—(లొంగినట్టుగా) ఈ గొలుసేనా! నీతికీ, లంచరికానికీ పొలిమేర! నాగి నీతి కరీదు ... ఇంతగొలుసే! ఇంతగొలుసిస్తారా? (గొలుసు చూచేవాడిలాగా కంఠం మీద చేతులుపెట్టి, గొలుసుచూస్తున్నట్టే నటిస్తూ) మా రాజులు! ఎంతకైనా తగుదురు! (లక్ష్మీనరసయ్య గొంతు పట్టుకొని పిసుకుతూ, బిగ్గరగానవ్వుతూ)సావు! నీబంగారం, నీగొలుసు, నువ్వు_ఓరి కా_వాలె! (శాస్త్రుర్లు, వెంకయ్య చీకటిలోనుంచి 'ఆ! ఆ! 'అంటూ పరుగెత్తుకొస్తారు. నరసయ్యను వదిలేసి పుల్లడు పిచ్చిగానవ్వుతూ, తూలుతూ వెళ్లిపోతాడు.)

లక్ష్మి:—(తెప్పరిల్లి) పట్టుకోండి! గాడిదెను పట్టుకోండి! పోలీసోళ్ళకుచెప్పి, వీడి భరతంపట్టిస్తా! (పోతాడు)

శాస్త్రుర్లు:—కావాల్సిందే! వెధవలకు శాస్తికావల్సిందే! ఎంతపొగరు! ఎంత తల బిరుసుతనం! వీళ్ళకితోడు చదువులు, సంఘాలుకావాలట! వెంకయ్యగారూ! కాళ్ళతో ఆలోచనజరుపుతామా? ఎక్కడ ఉండాల్సినవాళ్లు అక్కడ వుంటే రవ్వ, రట్టు ఉండదుగాని, చూడండి, పూచిక పుల్లకు కొరగాని వెధవలంతా మాట్లాడ్డం మొదలిడితే,

తత్రాపి, ధర్మాలు బోధించడం ప్రారంభిస్తే ప్రపంచం మరి తారుమారు కాదా!

వెంగయ్య:—శాస్త్రుల్లుగారూ! అమాయకత్వంలోనే ఆనందం వున్నదంటారు గాని, మిమ్మలను చూస్తే మౌఢ్యంలో కూడా ఆనందం వున్నదనిపిస్తుంది! ప్రపంచం తల్లక్రిందులైనా మీ దృష్టి మారదేం? చచ్చిపోవడానికి లేని విభేదాలు బ్రతకడానికి ఎక్కడవండి? లక్షలాదిగా తిండిలేక చచ్చిపోతున్నా, మీ సనాతనం, మీ ఛాందసనం, మీ అహంకారం తగ్గవేం? కొండలయినా బ్రద్దలవుతవిగాని, మీ మూఢనమ్మకాలు నాశనం కావేం? మీరంతా యిష్టం వచ్చినట్లు తిని, పారేయవచ్చేం? బీదసాదలు నీలిగి చావాల్సిందేనేం? దానవధర్మం కూడా యిలా వుండదే! మీరు మానవులనిపించుకుంటారా? మీచుట్టూ ప్రతిరోజూ యిన్ని శవాలు లేస్తున్నయ్! యిన్ని మార్పులు వస్తున్నయ్? మీరు మాత్రం తొణుకు బెణుకు లేకుండా ఉన్నారే! ఎంత ఆశ్చర్యం!

శాస్త్రుల్లు:—చూడండి! ధర్మశాస్త్రాలన్నీ కూడా... ...

వెంకయ్య:—కాలాన్నిబట్టి ధర్మశాస్త్రాలు కూడా మారుతయ్. నీతి ఒక్కటి మాత్రం గమనించినవారికి ఎప్పుడూ ఒక్కటే. మానవుడి నీతి మానవత్వం—కరుణ—పొరుగువానికి కష్టాలలో ఆదుకోవడం... వాడిని బలిపెట్టి పంచభక్ష్యాలు

తినడం కిరాతప్రవృత్తి... అంతకంటె హీనం... (పెద్దోడు మెల్లిగా వచ్చాడు.) ఏం బాబూ ! ఇల్లావచ్చావ్ ?

పె:—ఏంజేసేది ? ఎవరికారే ! ...అంతా నన్నిడిచిబెట్టిపోయారు ! కడుపు కక్కూర్తికోసం శీలం అమ్ముకుంటున్న ఆడది శాస్త్రరొట్టెముక్క పెట్టింది... అమ్మ, తమ్ముడు, చెల్లి, అంతా... అంతా...

వెంకయ్య:—మానవలోకానికి తీరని కళంకం !

శాస్త్రుర్లు:—చూడునాయనా! దుఃఖించకు. జీవితం క్షణభంగురం. కలిమిలేములు కావడికుండలు. నాయనా ! నేను, నావారు, నావస్తువు—ఇదంతా భ్రమ ! పరమాత్ముడే సత్యం. మిగతాదంతామిథ్య !

పె:—దేముడులేడు, గీముడులేడు.

శాస్త్రుర్లు:—అలా అంటావుగాని, దేవుడులేకేం ? వెన్నెల చల్లదనం, కోకిలమధురస్వరం, సంపెంగవాసన, ఆశ, నిరాశ, ఆవేశం, ఆనందం—ఇవన్నీ దేవుడులేకపోతే ఎలా వస్తున్నవి? నాజీవితమంతా నేను భగవత్ సృష్టినిమెచ్చడంలోనే గడిపాను. అందులోనిఆనందం నేను అనుభవించాను.

వెంకయ్య:—జీవితమంతా మిమ్మల్ని మీరు మోసవుచ్చుకోవడంతోనే సరిపోయిందన్నమాట ! చల్లనియింట్లో సుష్టుగా భోంచేస్తూ నక్షత్రాల్ని, అప్సరసల్ని, ప్రేమను వర్ణించారేం ? నిజంనుంచి దొంగలాగాపారిపోయి, కల్ప

నాజగత్తులో తలదాచుకొన్నారేం? ఘనకార్యమే!

శాస్త్రుర్లు:—అదేమిటండీ! శరత్ చంద్ర చంద్రికా వీధులలో ప్రేమవిహంగ మధుర నిస్వనాలు వినని హృదయ విహీనుడేడీ?

పె:—బీనా బిక్కా వేసి సెతుకి కాలవల్లో పిశాచాల్లాగా గంతులేయని పున్నెత్ముడేడీ!

శాస్త్రుర్లు:—పోనీ! సర్వాంతర్యామియైన పరమాత్ముని దివ్య నామ సంకీర్తనంలో అమరానందం అనుభవించని కర్కశ హృదయుడేడీ?

వెంకయ్య:—కష్టజీవుల కన్నీటి స్రవంతిలో ప్రపంచానికి ఘోర శాపం కలదని గుర్తించే వివేకి ఏడీ?

శాస్త్రుర్లు:—లోకాలన్నిటినీ సృష్టించి, పాలించి. ముంచివేయ గల భగవంతుని భజించి, తరించని పాపాత్ముడేడీ!

పె:—ఆదేవుడే బానిసండి! ఈమాత్రం తెలియదూ? కాక పోతే అందరినీ ఒక్కటిగానే పుట్టించినవాడు, ఒక్కటి గానే చంపేవాడు, ఒక్కటిగానే బతకనివ్వడూ?

శాస్త్రుర్లు:—దేవుడు లేడంటావా?

పె:—లేకేం? పేదా బిక్కా నోరుమూయించడానికి పెద్దలు రాసిన పుస్తకాల్లో వున్నాడు.

శాస్త్రుర్లు:—ఆ పరమాత్ముని దివ్యసందర్శనం కోసం ఎన్ని సంవత్సరాలుగా నేనుపరితపిస్తున్నానో నీకేం తెలుసు?

పె:—మళ్ళీ మీరుప్పుడితే, మాలోఒకళ్ళుగా పుట్టండి. దేవుడు యిరవైనాలుగు గంటలూ కనిపిస్తాడు!

శాస్త్రు:—ఇన్నికష్టాలలో కూడా దేవుణ్ణి నిందిస్తున్నావే? తప్పు క్షమించమని వేడుకో?

వెంకయ్య:—మాలవాడికి దేవుడేమిటి?...అన్నీదయ్యాలేగా!

పె:—దేవుడేవుంటే, మాదగ్గిరకిరావాలి! ఇంతకాలం స్వర్గలోకంనుంచి మమ్మల్ని జూసి ఊరుకున్న మహాపాపానికి మా శాస్త్రిమీద పడాలి!......మీరు కవులుకారూ? ......బతుకంతా సౌఖ్యమే కాదూమీకు? మాగుడిసెలు చూశారామీరు! కష్టజీవులు పాట్లాడే మారికి గంటలు చూశారామీరు? ఎముకల పోగుల్లాగా కనిపించే మాపిల్లల్ని చూశారామీరు! తిండిలేక, చలికి గుడ్డలేని ఆ దరిద్రులు మీకంటికి కనుపించారా? వారిని చూచేవుంటే బిడ్డలు కావడానికి వుండేలేదా మీకు? మానం దాచుకోడానికి గుడ్డపేలిక లేక, తినడానికి మెతుకు లేక, వీధులవెంట శరీరాల నమ్ముకునే పేదరాళ్ళను చూచారా? మీరు గొప్పగా చెప్పుకొనే సంఘం యింత చేసింది...ఇదంతా మీకు కనిపించదామె! బతుకుతేనె తుట్టంటారు! అప్సరసలను వర్ణించేసి, వాస్తవాన్ని చూసి భయపడే ధనికులకు జోలపాడడంలో నే మీ బ్రతుకంతా గడిచిందికాని, నూటికి 90 మంది చొప్పున వున్న బీదలను

చూచి నిట్టూర్చారా మీరు? దయతో ఒక్క మాట
న్నారా? ఈ సారైనా మీరు, పేదోడుగా, లేకపోతే
పేదోడింటో మట్టిముంతగా పుట్టండి! ఆ మట్టిముంతకు
నోరుంటే కలకాలం వుండే వేడినిట్టూర్పుల కథ చెపుతుంది.
మా పేదకుటుంబానికి కొంతసేవైనా చేస్తున్నది, ఆ మట్టి
ముంతేగాని మీరుగాదు. ఇంకెంతకాలం యీ మాయ
సాగిస్తారు? మా ప్రాణాలింకా ఎన్నిబలికావాలి? ఇంకా
మనసు తీరలేదా? ఇంకా దయరాదా? (ఆయాసం వచ్చి
పడిపోతాడు. వెంకయ్య అతడినిపక్కనోబెట్టి విసురుతుం
టాడు. పెద్దోడు దగ్గుతుంటాడు)

వెంకయ్య:—(శాస్త్రుల్లును జూచి, సావేశంగా) ప్రపంచమంతట
కూడా దినదిన గండంగా బతుకుతూ, అర్ధాంతరంగా
చచ్చిపోతున్న కోట్లాది పౌరులు—యుద్ధంలో చచ్చింది
వారే! కష్టాలు పడ్డది వారే! నూతన ప్రపంచనిర్మాణంలో
వారికి అవకాశం లేకపోతే, మళ్ళీ యుద్ధంతప్పదు. కండ్లు
తెరచి వాస్తవాన్ని గమనించండి కవిగారూ! ప్రపంచ
శాంతి నాశించి, ఈసందేశాన్ని అందివ్వండి కవిగారూ!
ఇంతకాలం బతికినందుకు ఈమాత్రం పనిచేయలేరా?
ఇది చేయకపోతే, మీ కవితాశక్తికి కళంకం! మీవలన
ప్రపంచానికి ప్రయోజనం శూన్యం!

(పెద్దోడు విపరీతంగా దగ్గి, నెత్తురు కక్కుకొని పడిపో

తాడు. వెంకయ్య కన్నీరు తుడుచుకొని తన పైపంచ పెద్దోడి మీాద ఆపాదమస్తకం కప్పివేస్తాడు... ... శాస్త్రుల్లు మెల్లిగా వచ్చి వాడి శవానికి నమస్కారంచేసి ... ...)

శాస్త్రుల్లు:—నీమాటలలో గుండెమాట్లాడింది! ఏది వినువ్వే!

(లక్ష్మీనరసయ్య పరుగెత్తుకువస్తాడు)

వెంకయ్య:-(నరసయ్యనుజూచి, ఉరుముగా) నువ్వెప్పుడు వచ్చావ్ ?

లక్ష్మి:—(ఆశ్చర్యంగా) ఆ ?

వెంకయ్య:—(కఠినంగా) ఆ! ఇంతకు కారణం నువ్వు ... పద.... పోలీసులకు పట్టిస్తా ... పా ... నోర్మూయ్!

(నరసయ్యను తీసుకుపోతాడు. శాస్త్రుల్లు పెద్దోడి శవంపైపై నిశ్చలదృక్కులతో చూస్తుంటాడు.

[లోపలినుంచి—దేశమును ప్రేమించుమన్నా!

మంచి యన్నది పెంచుమన్నా!

స్వంతలాభము కొంతమానుక

పొరుగువానికి తోడుపడవోయ్

దేశమంటే మట్టికాదోయ్!

దేశమంటే మనుషులోయ్!)

— తెర —

— సమాప్తం —

———